# త్యాగధనులు


రచయితలు:

ఆదిరాజు చంద్రమౌళీశ్వరరావు,

గబ్బిట మృత్యుంజయశాస్త్రి విద్వాన్

(సీనియర్ తెలుగు పండిట్ ఇ. సి. యమ్. హైస్కూల్)

హిందూపురం





పబ్లిషర్సు:

ఉమా పబ్లికేషన్సు, ఉయ్యూరు.

[వెల రు. 0-14-0

# మనవి

---

సర్వధర్మములకు మేలుబంతి స్వార్థత్యాగము. అట్టి త్యాగముచేతనే మహాత్ముని నాయకత్వమున మనభారతము సర్వతంత్ర స్వతంత్రమైనది. ఈ స్వాతంత్ర్యమునకు చిర స్థాయిత్వము భారత యువకుల ప్రవర్తనముపై నాధారపడినది. వారిట్టి శక్తిమంతులగుటకు స్వదేశమందలి స్వార్థత్యాగుల జీవిత పఠన మత్యావశ్యకము ఇట్టిసంకల్పముతోనే భారత దేశమందలి ప్రాచీన నవీన త్యాగశిరోమణుల జీవితగాథలిందు కూర్పబడినవి. వీనిఁబఠించినబాలకులుత్తమ భారతపౌరులగుదు రని మా హృదయపూర్వక విశ్వాసము.

కాని మా యీ ప్రయత్న సాఫల్యమున్నత పాఠశాలా నిర్వాహకులయు, నుపాధ్యాయ సోదరులయునుదార హృదయ ములపైనిలిచినది.

ఈ మాకృషికి గావించు సూచనలన్నియు సాదరముగ స్వీకరింపబడును.

—రచయితలు

---

# విషయసూచిక

సుభాసు చంద్రబోసు తండ్రి జానకీనాథబోసు. తల్లి శ్రీమతి ప్రభావతీబోసు. వీరి తృతీయ కుమారుడే సుభాసు చంద్రబోసు. జానకీనాథబోసు కటకమునందు న్యాయవాదిగా చాలధనమును సంపాదించెను. జానకీనాథబోసు ఒకసారి కటకమునకు పురపాలక సంఘాధ్యక్షుడాయెను. మరియొకసారి జిల్లాబోర్డునకుగూడ అధికారి యయ్యెను. ప్రజానురంజకుడగుటచే ప్రభుత్వమీ జానకీనాథబోసునకు "రాయబహాదురు" బిరుదమిచ్చెను. రాయబహద్దరు జానకీనాథబోసు గవర్నమెంటు వకీలుగఁగూడ నియమింపఁబడెను.

సుభాసుచంద్రబోసు 1897 సం॥ జనవరి 23వ తేదీన జన్మించెను. బోసు క్రమముగా కటకపట్టణమందలి ఆంగ్లేయపాఠశాలయందు కొన్నాళ్లు, రావెన్షా కాలేజి హైస్కూలులో కొన్నాళ్ళును చదివెను. సుభాసు యూనివర్సిటీ మెట్రిక్యులేషను పరీక్షలో మొత్తముమీఁద రెండవ వాడుగ సుత్తీర్ణుఁడై ప్రఖ్యాతి గడించెను.

సుభాసు కలకత్తాలోని రాజధానీ కళాశాల (ప్రసిడెన్సీ కాలేజి)లోఁ జేరి చదువనారంభించెను ఈ మధ్య కొంతకాలము తల్లిదండ్రులతోఁ జెప్పక వైరాగ్యముగలిగి నానాతీర్థంబులను తిరిగివచ్చెను. ఇంటిలో మూఁగవానివలెఁ జెవిటివానివలె నేదియో యోచింపసాగెను.

గాంధీమహాత్ముఁడు బారిస్టరుగనుండి దక్షిణాఫ్రికాలో ప్రభుత్వముతోఁ బోరుచుండిన కాలములో, నెహ్రూపండితుఁడు

హారో కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయములో చదువుచున్నకాలములో, బోసుముక్కుమూసికొని తపమాచరించుకొనుచుండెను.

తల్లి ప్రభావతి బోసు "నాయనా! చదువు మానితివేని చదువకయున్న గౌరవము లేదు. చదువరానివాడు సర్వోన్నతునకును పనికిరాడు. ధ్రువునకు చదువరాదని విష్ణువు శంఖముతో నూరాది విద్యనేర్పెను. దేశనాయకుడవు కావలెనన్న నున్నతవిద్య కావలయును. నాయనా! పసితనమున చదువక పోయినచో పెద్దతనమున విచారింతువు." అని బోధింపగా బోసు కళాశాలలో మరల ప్రవేశించెను. యఫ్. ఏ. పరీక్షయందు మొదటిశ్రేణిలో నుత్తీర్ణుడయ్యెను

తరువాత బోసు స్కాటిషుచర్చి కాలేజిలోచేరి బి. ఏ. మొదటి తరగతిలో నుత్తీర్ణుడయ్యెను. ఇచ్చటి కళాశాలలో చదువునప్పుడే సైనిక శిక్షనుపొందెను. ఉపాధ్యాయులచే గొప్పబహుమానములను పొందెను. ఈ సైనికశిక్షణమే యితని "అజాద్ హింద్ ఫౌజు" నిర్మాతగను మహా సైన్యాధ్యక్షునిగను చేసినది.

తరువాత బోసు ఐ. సి. యస్. పరీక్షకు చదువుటకై యింగ్లాండునకు బోయెను. ఐ. సి. యస్. పరీక్షలో నాల్గవవాడుగ నుత్తీర్ణుడయ్యెను. తిరిగి మాతృదేశమునకువచ్చి గాంధిమహాత్ముని దర్శించెను. చిత్తరంజనుదాసుతో పరిచయము చేసికొని ఆయనకు కుడిభుజమై రాజకీయములందారితేరెను.

చిత్తరంజనుడు కలకత్తా నగరపాలక సంఘాధ్యక్షుడయ్యెను. ఆ సంఘము పూర్తిగ స్వరాజ్యపక్షవాదుల హస్తగతమగుటచే బోసు ప్రధాన కార్యనిర్వాహకోద్యోగి (చీఫ్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు)గ నెలకు మూడువేలరూపాయిలు జీతముమీద నియమింపబడెను. సుభాసుచంద్రుడు తనకు పదిహేనువందల రూపాయిలజీతము చాలుననియు మిగిలిన జీతము నగరాభివృద్ధికే వెచ్చింపవలయుననియు కోరెను. అంతకుముందతనే యిండియను సివిల్ సర్వీసు ఉద్యోగమును విడిచిపెట్టెను. యిప్పుడీ యుద్యోగమునందు త్యాగముచూపి బోసునందరకు అందరికి నాశ్చర్యము కలిగించెను.

బోసునకీ ప్రధానోద్యోగ మిచ్చుటకు ప్రభుత్వమడ్డు తగిలెను. అయినను చిత్తరంజనుడు పూనము పట్టినపట్టు వీడలేదు. కార్పొరేషనులోని యుద్యోగులెల్లరు గాంధి టోపిని, ఖద్దరును ధరించిరి. బహిరంగ ప్రదేశములకు, పేటలకు, వీధులకును, విదేశీయుల పేర్లు తీసివేసి దేశీయుల పేర్లు పెట్టఁబడినవి. దేశీయపాఠశాలలు నెలకొల్పఁబడినవి. అన్ని వర్ణముల వారికి సమమగు గౌరవము పాటింపబడినది. అది ప్రభుత్వమునకు కంటకమయినది. బోసు అరెస్టు చేయబడి ఏ విచారణ లేక మాండలేకోటలో బంధింపబడెను. పూర్వము శ్రీ లోకమాన్య బాలగంగాధరతిలక్ మహాశయుడుంచ బడిన యీ చెరసాలలో నుండుటకు బోసుసంతోషించెను. కాని ఆరోగ్యము చెడుటచే రంగూను జెయిలునకుమార్చిరి. అచ్చటను జబ్బుఎక్కువగుటచే బోసును విడుదలఁజేసిరి.

వాసము బోసునకున్ను సరికే చత్తరంజనుడు దివమలంకరించెను. కొలది దినములకే వంగదేశపు కాంగ్రెసు సంఘపు ఎన్నికలు వచ్చినవి. సుభాసు గెలుపొందెను. ఆరోగ్యము కోలుకొన్న రాజకీయములలో నిమగ్నుడయ్యెను. "ప్రభుత్వమును ప్రజలకెంత వరకీయవచ్చు" ననువిషయములో విచారించుటకు సైమన్ కమీషను సభ్యులు హిందూదేశమునకు వచ్చిరి. స్వరాజ్యసంఘమువారు "అధినివేశ రాజ్యము (డొమినియన్ స్టేటస్)ను కోరిరి. సుభాసు, హిందూ దేశపు రాజకీయ పరమావధి. సంపూర్ణ స్వాతంత్ర్యమేగాని, అధినివేశప్రతిపత్తి కాదని తీర్మానించెను.

బోసు కాంగ్రెసు నదిరించుటకిదే తొలిసారి. గాంధి మహాత్ముడు బోసువాదన నంగీకరించలేదు. కాని బోసుఅనేక సభలను జరిపి ప్రజలలో సంచలనము గలిగించెను. లాహోరు కాంగ్రెసులో స్వాతంత్ర్యపు తీర్మానమునకు సుభాసుబోసు "అయిర్లండులోని ప్రజలు బ్రిటిషు ప్రభుత్వముపైగల ద్వేషము పురస్కరించుకొని రెండవప్రజాప్రభుత్వమును ఏర్పాటు గావించి స్వాతంత్ర్యమును బడసినట్లే, హిందూదేశములో రెండవ ప్రజాప్రభుత్వమును నెలకొల్పవలసిన"దని సవరణను ప్రతిపాదించెను. కాని సవరణ వీగిపోయెను.

1930వ సంవత్సరమున ఉప్పు సత్యాగ్రహోద్యమము ప్రారంభింపబడినది. పెద్ద నాయకులు ఇతరులు చరసాలలో నుంచబడిరి. బోసు 124 సెక్షన్ క్రింద తొమ్మిది మాసములు

చెరసాలనుంచబడెను. చెరసాలలో బోసును లాఠీలచే గట్టిగా స్మృతితప్పి పడిపోయెను. ప్రజలకీ సమాచారము తెలిసి యలజడి రేగినది. ఆయన పైనున్న అభిమానమువలన చెరసాలలోనుండగా బోసును "అఖిలభారతవర్తక సంఘ కాంగ్రెసు" (ఆలిండియా ట్రేడు యూనియన్ కాంగ్రెస్) వారు అధ్యక్షునిగా నెన్నుకొనిరి.

1930 సం॥ సెప్టెంబరులో బోసువిముక్తులయ్యెను. కాని 1931 సం॥ లో తిరిగి కొన్ని పర్యాయములు బంధింపఁబడి విడుదల కాబడి తుదకు కలకత్తాకుఁ జేరుకొనెను.

స్వాతంత్ర్యదినపు ఊరేగింపును కాంగ్రెసువారు బయలుదేర దీసిరి. ప్రభుత్వము యూరేగింపును నిషేధించి నది. బోసుతీవ్రవాదియై యూరేగింపును కొనసాగించి లాఠీలచే మోదఁబడి తిరిగి యారుమాసములు చెఱకుఁ బంపఁబడెను.

గాంధియిర్వినుల ఒడంబడిక ప్రకారము శిక్షాకాలమునకుఁ బూర్వమే రాజకీయ ఖైదీలందరు విడుదలఁబొందిరి. బోసు మరల కాంగ్రెసువారి విశిష్ట ధర్మమును ప్రజలకు బోధించుచుండెను.

రౌండుటేబులు కాన్ఫరెన్సు విఫలమగుటచే గాంధి మహాత్ముడు భారతదేశమునకు తిరిగివచ్చె, కాంగ్రెసు కార్య నిర్వాహకవర్గ సమావేశమునకుబోసును ఆహ్వానించెను. బోసు బయలుదేరగా త్రోవలో, మరల అరెస్టుకాబడి చెరసాలలో పెట్టఁబడెను. క్షయరోగ లక్షణములు కల్గుటచే బోసును

చికిత్సకై ఐరోపా దేశమునకుంచి తీసుకట్టుకొనిపోనుంచిరి. అదృష్ట వశమున బోసునకు వియన్నా పట్టణపు అధ్యక్షునితో మంచి పరిచయము కల్గెను.

బోసు వియన్నా పట్టణమునఁ జికిత్సఁబొందు కాలముననే ఢిల్లీ కేంద్రశాసనసభాధ్యక్షులైన విఠలుభాయి పటేలుకూడ నచ్చటకువచ్చి వైద్యచికిత్సఁ బొందసాగెను. వారుభయులు కాంగ్రెసు విషయముల నేకము లాలోచించి విమర్శించిరి. బోసు ఆధ్వర్యముక్రింద స్వరాజ్య ప్రచారము జరుపుటకై ఆర్జితములోనుంచి లక్షరూపాయల నిధిని పటేలు ఏర్పాటుచేసి వియన్నానగరమందే చికిత్సబొందుచునే కన్నుమూసెను.

హిందూ దేశీయుల యఖిలపక్ష సమావేశము లండను నగరములో బోసు అధ్యక్షతక్రింద జరుపబడుటకు యేర్పాటు కాబడినది. కాని పాలకులు బోసు వెళ్ళుట కంగీకరింపనందున నియన వ్రాసిన అధ్యక్షోపన్యాసమా సభలో చదువబడినది.

ప్రభుత్వమువారి యాజమాన్యముక్రింద జర్మనీ దేశము తప్ప మిగిలిన ఐరోపా ఖండమునంతను పర్యటించుటకు బోసునకు నవకాశము కల్గెను. భారతదేశ రాజకీయములపై నుపన్యసించెను. జనులు వేలకొలదిగ మూగి వినుచుండిరి.

తండ్రి చాల జబ్బుపడెనని విని సుభాసు విమానములో కరాచీ జేరెను. ఇంటికిఁ జేరకమునుపే తండ్రిచనిపోయెను. తండ్రి యంత్యక్రియలు జరిగిన వెంటనే బోసును తిరిగి వియన్నా పట్టణమునకుఁ జికిత్సకై ప్రభుత్వమువారు తీసుకువెళ్ళిరి.

చెరసాలలోనుంచఁబడెను. చెరలో బోసుకు లాఠీలచే గాట్లుగా స్మృతితప్పి పడిపోయెను. ప్రజలకీ సమాచారము తెలిసి యలజడి రేగినది. ఆయన పైనున్న అభియోగములవలన చెరసాలలోనుండగా బోసును "అఖిలభారతవర్తక సంఘము కాంగ్రెసు" (ఆలిండియా ట్రేడు యూనియన్ కాంగ్రెస్) వారు అధ్యక్షునిగా నెన్నుకొనిరి.

1930 సం॥ సెప్టెంబరులో బోసువిడుదలయ్యెను. కాని 1931 సం॥ లో తిరిగి రెండు పర్యాయములు బంధింపఁబడి విడుదల కాబడి తుదకు కలకత్తాకుఁ జేరుకొనెను.

స్వాతంత్ర్యదినపు యూరేగింపును కాంగ్రెసువారు బయలుదేర దీసిరి. ప్రభుత్వము యూరేగింపును నిషేధించి నది. బోసుతీవ్రవాదియై యూరేగింపును కొనసాగించి లాఠీలతో మోదఁబడి తిరుగ యారుమాసములు చెఱసాలఁ గాల్పవలసెను.

గాంధియిర్వినుల యొడంబడిక ప్రకారము శిక్షాకాలమునకుఁ బూర్వమే రాజకీయ ఖైదీలందరు విడుదలఁబొందిరి. బోసు మరల కాంగ్రెసువారి వివిక్త ధర్మమును ప్రజలకు బోధించుచుండెను.

రౌండుటేబులు కాన్ఫరెన్సు విఫలమగుటచే గాంధి మహాత్ముఁడు భారతదేశమునకు తిరిగివచ్చి, కాంగ్రెసు కార్య నిర్వాహకవర్గ సమావేశమునకుబోసును ఆహ్వానించెను. బోసు బయలుదేరగా త్రోవలో మరల అరెస్టుకాబడి చెరసాలలో పెట్టఁబడెను. క్షయరోగ లక్షణములు కల్గుటచే బోసును

చికిత్సకై ఐరోపాదేశమునందుంచి తగుకట్టడిలోనుంచిరి. అదృష్ట
వశమున బోసునకు వియన్నా పట్టణపు అధ్యక్షునితో మంచి
పరిచయము కల్గెను.

బోసు వియన్నా పట్టణమునఁ జికిత్సబొందు కాలము
ననే ఢిల్లీ కేంద్రశాసనసభాధ్యక్షులైన విఠలు భాయి పటేలుకూడ
నచ్చటకువచ్చి వైద్యచికిత్సఁ బొందసాగెను. వారుభయులు
కాంగ్రెసు విషయములనేకము లాలోచించి విమర్శించిరి.
బోసు ఆధ్వర్యముక్రింద స్వరాజ్య ప్రచారము జరుపుటకు
తనార్జితములోనుంచి లక్షరూపాయలు నిధిని పటేలు ఏర్పాటు
చేసి వియన్నానగరమందే చికిత్సబొందుచునే కన్నుమూసెను.

హిందూదేశీయుల యఖిలపక్ష సమావేశము లండను
నగరములో బోసు అధ్యక్షతక్రింద జరుపబడుటకు యేర్పాటు
కాబడినది. కాని పాలకులు బోసువెళ్ళుట కంగీకరింపనందున
నాయన వ్రాసిన అధ్యక్షోపన్యాసమా సభలో చదువబడినది.

ప్రభుత్వమువారి యాజమాన్యముక్రింద జర్మనీ దేశము
తప్ప మిగిలిన ఐరోపా ఖండమునంతను పర్యటించుటకు
బోసుకు నవకాశము కల్గెను. భారతదేశ రాజకీయములపై
నుపన్యసించెను. జనులు వేలకొలదిగమూగి వినుచుండిరి.

తండ్రి చాల జబ్బుపడెననివిని సుభాసు విమానములో
కరాచీఁజేరెను. ఇంటికిఁ జేరకమునుపే తండ్రిచనిపోయెను.
తండ్రి యంత్యక్రియలు జరిగినవెంటనే బోసును తిరిగి వియన్నా
పట్టణమునకుఁ జికిత్సకై ప్రభుత్వమువారు తీసుకువెళ్ళిరి.

1933 సం॥న కాంగ్రెసు అధ్యక్షుడుగ పండిత నెహ్రూ ఎన్నుకొనబడెను. సుభాసునకాహ్వాన మంపబడినది. కాని భారత దేశమునకు వెళ్ళుటకు ప్రభుత్వ మంగీకరింపలేదు. విదేశములలో స్వల్పస్వేచ్ఛతో సంచరించుటకంటె స్వదేశములో బందియై యుండుటయే మేలనితలంచెను. ఎవరికీ తెలియకుండగనే స్టీమరులో బొంబాయి చేరగా ప్రభుత్వము వారు పట్టుకొని యెరవాడ జైలులోనుంచిరి. సుభాసును విడుదల చేయుడని స్వదేశ విదేశములనుండి ప్రభుత్వమువారికి వొత్తిడి కలిగినది. రాష్ట్రపరిపాలనత్వములు అమలులోనికి రావలసి యున్నవి ప్రభుత్వమువారు ఎన్నికలుజరుపఁదలచి బోసును విడుదలఁ జేసిరి.

హరిపుర కాంగ్రెసుకు సుభాసు అధ్యక్షుడయి బ్రహ్మాండమైన యుపన్యాసమును గావించెను. తరువాత త్రిపురి కాంగ్రెసునకొక ప్రసిద్ధిగాంచినవ్యక్తికి పోటీగా నిలబడి మరల రాష్ట్రపతి యయ్యెను. కాని కాంగ్రెసు నాయకులు తన కెదురగుటచేఁ దనపదవికి రాజీనామానిచ్చెను.

తీవ్రవాది యని మరల అరెష్టుచేసి బోసును విచారణ లేకుండ కారాగారమున నుంచిరి. ఆరోగ్యము చెడుటచే ప్రభుత్వమునకు దప్పనిసరియై ఆయనను విడుదలచేసి స్వగృహము దాటకుండునట్లు కట్టుదిట్టముఁ జేసిరి. దేశీయులాశ్చర్యముఁబొంద, పాలకులు కలవరముచెంద బోసు 1941 సం॥ జనవరి 15వ తేదీన అదృశ్యుడయ్యెను.

# 2. బోసు అంతర్ధానగాథ

అదృశ్యుడైన బోసును పట్టుకొనుటకుఁ బ్రభుత్వము ఎంతప్రయత్నించినను జాడ తెలియలేదు. సుభాసు మాస్కోకుఁ బోవలెనని తన స్నేహితులతో రహస్యముగా చాల కాలమునుండి యాలోచించుచుండెను. కాని వీలు దొరకలేదు మిత్రులు తప్పక తన్ను మాస్కో నగరమునకుఁ జేర్పించెదమని మాటనిచ్చిరి.

బంధితుడు బయటకుఁ రావలెనన్న మారువేషము వేయవలసి యున్నది. వేషధారణకు ప్రధానము గడ్డము పెంచుట. ఆరోగ్యము సరిగా లేదనియు నెవ్వరు సుభాసు చంద్రునితో మాటలాడ గూడదనియు, విశ్రాంతి లేకున్న వ్యాధి నివారణ కాదనియు డాక్టరు చెప్పిరని చెప్పి తన యింటిలో నొకగదిలోనుండి గడ్డముపెంచెను. ఆయనతో నత్యవసరమున్న, మాట్లాడుటకు గదిలోనుండి వెలుపలకు టెలిఫోను నేర్పాటుచేసిరి. ఆహారమును తాను ముసుగు వేసికొని నెవరికంటఁబడకుండ లోనికిఁదీసికొనివెళ్ళి భుజించుచుండెను. సొంత సేవకులెవ్వరైన నాయనముసుగునుజూచిన నిజముగా జబ్బుగా నున్నదని తలంచిరి. బయటమిత్రులుబోసు రష్యా వెళ్లుటకు తగు ప్రయత్నములన్నియు నేమరక జేయుచుండిరి.

గడ్డముపెంచుట ప్రారంభించి పలుబది రోజులయ్యెను. 1941 సం॥ జనవరినెల 15వ తేది రాత్రి 8 గంటలకు నిశ్శబ్దముగా నొక మోటారు వాకిట నిల్చినది. తన ముఖ్యమిత్రులతోఁ గలసి సుభాసు మౌల్వీవేషధారియై ప్రయాణము సాగించెను. కలకత్తాకు పలుబదిమైళ్ళ దూరములోనున్న యొక స్టేషనుచేరి రైలునెక్కి రెండవ తరగతి పెట్టెలో గూర్చుని ప్రయాణము చేసెను. ఆ రాత్రి ప్రయాణము బాగుగనే సాగెను. ఆ మరునాఁడొక సిక్కు ప్రయాణీకుఁడా పెట్టెలోనెక్కి బోసుప్రక్కనే గూర్చుండి సంభాషింపఁజొచ్చెను.

సిక్కు:- మీరెక్కడనుండి వచ్చుచున్నారు? ఎక్కడికి వెళ్లుచున్నారు? ఏమిపనిమీఁద వెళ్ళుచున్నారు? మీ పేరేమి?

మౌల్వీ:- మాది లక్నో, నా పేరు జియాఉద్దీను. ఇన్సూర్యెన్సు ఏజంటుగా పనిచేయుచు రావల్పిండి వెళ్ళుచున్నాను.

సుభాసు దారిలోని స్టేషనులలో రైలుబండియాగి నప్పుడు వార్తాపత్రికలతో తనముఖమును చాటుపరుచు చుండెడివాఁడు. ఆయనవేషమునుఁజూచి యెరిగిన వారుగూడ గుర్తింపలేక ఆయన నిక్కముగా మౌల్వీయని భావించిరి.

బోసు జనవరి 17 తేదిని యుదయము 8 గంటలకు పెషావరు చేరుకొనెను. ఆ స్టేషను దగ్గఱ బోసుకొరకు ఒక కారు సిద్ధముగానున్నది. ఆ కారుమీఁద మిత్రులు బోసు నొకరహస్యపు టింటికితీసికొనిపోయిరి. అచ్చటినుండికాబూలు నకు ప్రయాణించు ప్రయత్నములు సిద్ధముగాక పోవుటచే

పెషావరునందు రెండురోజులుండ వలసి వచ్చెను. ఆ రెండు రోజులచ్చట నుండుట బోసుకుకొంత ఆందోళనము కలుగ సాగినది.

"పెషావరు వరకు మానవమాత్రుఁడు నన్నుఁ దెలిసి కొనఁ జాలనటుల వచ్చితిని. ఇఁక కాబూలునకు, అటనుండి మాస్కోకుపోవుట ఎటుల సాగునో కదా!" యని బోసు పరిపరి విధములు విచారణలో మునిఁగ యుండెను

పెషావరులో బోసురెండురోజులు పూర్తిగానున్నను ఎవ్వరికిఁ దెలియదు. జనవరి 19 తేదిని మిత్రులుబోసునకు పఠానీ దుస్తులు తెచ్చియిచ్చిరి. ఉత్తరప్రదేశీవు మాల్వీగఁ గనబడుటకంటె పఠానుగకనబడుట అఫ్గనిస్థానములో సుకర ముగా నుండునని యాలోచించిరి.

రహమత్ ఖాన్ మఱియొక మిత్రుఁడు. బోసుమోటా రులో పెషావరునుండి జమ్రుద్ వెళ్ళురోడ్డుమీఁదనే ప్రయాణ మయ్యెను. ఆ మోటారులో మిత్రుఁడయిన రహమత్ ఖాను, డ్రైవరు, బోసు ముగ్గురు మాత్రమే ప్రయాణమైరి. జమ్రుద్ కోటకు కొంచెమీ వైపుగా మఱియొక దిక్కునకు చిన్నరోడ్డు చీలిపోవును. ఈ చిన్నరోడ్డులోనె మోటారు నడచిపోయినది అతి కష్టముతో చివరకు గర్హీయనె గ్రామము చేరిరి.

తరువాత మోటారు నడచుట క్షేమాత్రము వీలు కలుగలేదు, ఆరాత్రి గర్హీయందే కాలక్షేపముచేసిరి. మఱు నాడు బోసు రహమత్ ఖాను, మఱియిద్దఱు పఠానులు

కాబూలునకు కాలినడకతో ప్రయాణించిరి. మోటారు మిత్రుఁడు మోటారుతో మగిడి పెషావరుకుఁబోయెను. తోడు వచ్చిన యిద్దరు పఠానులు తుపాకులు పట్టుకొని నడచివచ్చిరి.

రహమత్ ఖాను బోసుతో "మిత్రమా ఈ రాజ్యము లోనిభాష నీకుసరిగా రాదుగనుక, నిన్నుసులభముగా గుర్తుపట్టుదురిచ్చటివారు. కావున నీవిచ్చటినుండి గమ్యస్థానముఁజేరువరకు, చెవిటి, మూగగ నటింపు"మనెను.

బోసు "అట్లే"యని నటింపసాఁగెను. మరునాడు సాయంకాలమునకు భారతదేశపు సరిహద్దును దాటిపోయిరి.

సరిహద్దు ప్రాంతమున:

సరిహద్దుదాటి యొక కొండజాతివారి గ్రామముఁజేరుకొనిరి. అక్కడ అద్దాషరీఫ్ అనునొక మసీదు ప్రసిద్ధిఁ జెందియుండెను. అందులో నొక మతగురువు కలఁడు. వారిబసకు అన్నిఏర్పాటులాగురువు కలుగఁ జేసెను. రాళ్ళనక రప్పలనక రోడ్ల మీఁద తెగనడచి యుండుటచే కాళ్ళుకాయలు కాచినవి. నరాల పోటులు సాఁగినవి ఆ మసీదులోనే వారునిద్రించు చుండిరి. తుపాకులతోవచ్చిన పఠానులిద్దరు మరలిపోయిరి. మరునటి ప్రయాణములో వారికి మఱిముగ్గురు పఠానులు తుపాకులతో తోడువచ్చిరి. ఈసారి ప్రయాణము యమ యాతనమైనది. అలసటతో తలచువారు ఆగుచునాగుచు

ప్రయాణించిరి. రాత్రి 9 గంటలకు లాల్‌పురా చేరుకున్నారు. అచ్చటకూడ వారికి ముందుగానే యేర్పాట్లు చేయఁబడినవి. ఆ రాత్రి వారచ్చట సుఖముగా నిద్రించిరి.

ఇచ్చటవారి కాతిథ్యమిచ్చినవ్యక్తి యొకఖాను. జమున కిక్కడనతఁడేరాజు. ఆఫగను గవర్నమెంటు ఉద్యోగులతో మంచిగౌరవము సంపాదించినవాఁడు. ఇంతవరకు నడచిన నడకకు బొత్తిగా నలసిపోయిరి. కాని కాబూలునది చేరుకొనుటకు ఇంకఁగొన్ని మైళ్ళుమాత్రము నడువవలెనవారి. కాబూలునది దాటిన వెంటనే కాబూలుకు బస్సులు కనుపించునని ధైర్యము కలిగించిరి.

ఆయాతిథ్యమిచ్చిన లాల్‌పురాఖాను వారికొక రహదారి ఉత్తరము వ్రాసియిచ్చి వారితో "దారిలో మిమ్మెవరైన ననుమానించి యిబ్బంది పెట్టినచో నీరహదారి కాగితముఁ జూపుఁ"డనెను. ఆ కాగితము పర్షియను భాషలో వ్రాయఁబడెను. ఆ కాగితమునందు—

రహమత్ ఖాను, జియాఉద్దీనులు కొండజాతివారు. సఖీసాహెబ్ మసీదుకు యాత్రవెళ్ళుచున్నారు. వీరు సత్ప్రవర్తనఁ గలవారని నేను హామీయిచ్చుచున్నాను. వీరి నెవరును ఇబ్బంది పెట్టకుండుటకు ఈ పరిచయ వాక్యములుగల యీ కాగితము వ్రాసియిచ్చితిని

లాల్‌పురాఖాన్.

## కాబూలునదిని దాటుట :

వారు లాల్‌పురానుండి బయలుదేరునప్పుడు వారితో సైనికులు సాయుధులు రక్షణమునకుగా వచ్చిరి. కొన్నిమైళ్ళు నడచిన తరువాత కాబూలునది చేరుకొన్నారు. కాని నదిని దాటుటకు అచ్చట పడవలేదు. నదిని దాటుటకు నీరు తెచ్చెడి తోలుసంచులను (తాళ్ళతోఁగట్టి నీళ్ళపై తేలవేచి వానిపై దాటుచున్నారు. మొదట బోసునకు భయము కల్గినది. కాని నారంగజు దాటుటచూచి ధైర్యముకల్గినది. అతికష్టముతో నా నదిని దాటిరి.

ఆఫ్ఘన్ గడ్డనోనడుగు బెట్టిరి. అచ్చట తుపాకులతో బహిరంగముగాఁ దిరుగుట నిషిద్ధము. అందుచేత వారితో వచ్చిన పఠానులు నదిదాటకయే తిరిగిపోయిరి. ఆ రీతిగా వారు దాకా తప్పించుకొనిరి.

(దాకాయనునది పెషావరుకు 50 మైళ్ళదూరములో నున్నగ్రామము. కాబూలు పెషావరులకుమధ్యతిరుగు ప్రయాణీకులు ఇక్కడ తమ ప్యాస్‌పోర్టులు చూపించుదురు. అచ్చట సామాను తనిఖీకూడ జరుగును.)

పెషావరు దాకాలమధ్యలోనే మూడుచోట్ల తనిఖీ జరుగునని యుందురు. ఇందుచేత నివన్నిదాటివచ్చుట చుట్టు మార్గము, పట్టుబడవచ్చునని డొంకతిరుగుడు దారిఁబట్టిరి. ఒక్కరోజుతో సరిపడు ప్రయాణము మూడురోజులు పట్టినది.

## అపాయముల రాత్రి:

కాబూలు నదిని దాటిన తరువాత రోడ్డుకు దగ్గఱగా చుంగియనే ప్రదేశమున్నది. అదొకతోపు. కొన్ని చెట్లు గుబురుగా నున్నవి అచ్చట నొక నుయ్యియున్నది. బస్సుకొరకు ఎదురు చూచుచునొక చెట్టుక్రిందజోసు పరుండెను. రహమత్ ఖానుమాత్రము కాబూలుదిశగా వెళ్ళుచున్నొక బస్సును ఆపవలసినదని చెయ్యెత్తి నూపుచుండెను. ఏ బస్సుకూడ ఆగలేదు. అలసటచేత జోసు నిద్రపోయెను.

కొంతసేపటికొక లారీవచ్చినది. అది సాయంసమయము. నిద్రలోనున్న జోసునులేపి లారీయెక్కుమనిరి, దానినిండ సామానుకలదు. అయినను జోసునెక్కుమని యాసామాను మీఁదఁ గూర్చుండఁబెట్టిరి.

రాత్రి చీకటి రోజులు మంచు దట్టముగా కురియుచున్నది. రోడ్డు ప్రక్కలనున్న చెట్లకొమ్మలు ఎక్కడ తగులునో యని భయపడిరి. జోసు ఇంతకంటె మంచిబస్సు దొరకలేదా! రహమత్ ఖాను 15 బస్సులు మనవైపు చూడనైనా లేదు. ఇందులో మనమెక్కకపోయిన రాత్రి మధ్యనరణ్యములో నివసింపవలసిన దురవస్థ పట్టెడిది" ఆ రాత్రి యంతయు లారీలోనే కూర్చుండిరి. దారిలో నచ్చటచ్చట వెచ్చతనము కొఱకు టీ త్రాగుచుండిరి. రెండవరోజునకు ఖక్ అనుచోటునకుఁజేరిరి. ఇచ్చట పాస్ పోర్టులు తనిఖీ చేయఁ

బడుచున్నవి. బోసు. రహమత్ ఖానులు మొదట కొంచెము భయపడిరి. ఆయధికారులు సమీపించి "ఎవరు? ఎక్కడికి పోవుచున్నా"రని ప్రశ్నించిరి.

రహమత్ ఖాను అధికారులతో "ఇతడు మా యన్నయ్యగారు ఇతనికి చెవుడు, మూగతనముకూడ కలదు. సఖీ సాహెబ్ మసీదుకు యాత్రవెళ్ళుచున్నా" మనెను. లాల్ పూరాఖాను వ్రాసియిచ్చిన సర్టిఫికెట్టునుచూపించిరి. దానితో నా యుద్యోగుల నోళ్ళు కట్టబడినవి.

మరల టీ త్రాగి లారీమీద ప్రయాణము సల్పి కాబూలు చేరుకొనిరి. లారీవానికి డబ్బునిచ్చిరి. ముందుగానే జాగ్రత్తపడి పెషావరునుండి ఆఫ్ఘన్ నాణెములు తెచ్చుకొనిరి.

మంచువిపరీతముగా కురియుచున్నది. తిరిగితిరిగి యొక బజారునకు జేరుకున్నారు. అచ్చట సమీపములో నొక సత్రవు కలదని తెలిసికొని యా సత్రవును సమీపించిరి.

వారా సత్రమును లోపల వెలుపల బాగుగా పరీక్షించిరి. ముందు భాగమున నొంటెలు, గుఱ్ఱాలు, కట్టబడి యున్నవి. వసారలో గొన్ని బండ్లుకూడనున్నవి. లోపల కూడ ఖాళీలేదు. ఒకడు సత్రములోనికి వచ్చుచుండగా "సత్రపు గుమస్తా యెక్కడనుండు"నని యడిగిరి. వాడు జవాబు చెప్పకయే పోయెను. అదివానికి తలబిరుసేమోయని వారు తలపోసిరి. రహమత్ ఖాను పుస్తుభాషతో మాట్లాడెను. అది వానికి తెలియక పోయెనని తరువాత వారూహించిరి.

"ఆఫ్ఘనులకు పుస్తుభాష మాతృభాష" యని మొదట తలంచిరి. కాని ఆఫ్ఘను స్థానము ప్రవేశించిన తరువాత వారిభాష పర్ష్యనుభాషయని తెలిసికొనిరి. అక్కడ పుస్తుభాష తెలిసినవారు చాలతక్కువమంది. రహమతు ఖానుకు పుస్తూభాష బాగుగావచ్చునుగాని పర్ష్యనుభాష ధారాళముగా రాదు. అందువలనగూడ కొంతచిక్కు కలిగినది. బోసునకు ఈ సంగతి పెషావరులోనే తోచినచో మిత్రులు పర్ష్యనుభాష మాటాడఁగల స్నేహితునే కూర్చెదువారు. వారికిమాత్రమీ సంగతి యేమి తెలియును!

సత్రపు కావలి వాఁడు.

కొంది నిమిషములకు తరువాత మేడమీఁద నొకగది నుండి యొక మనుష్యుఁడు దిగివచ్చెను "సత్రపుగుమాస్తా యెక్కడ నుండెను" యనియడిగిరి. అతఁడు సత్రపుపెద్ద గుమ్మము దగ్గరగానున్న యొకగదిని చూపుచు "అది కాపలా మనుష్యుఁడుండు ప్రదేశము, అతని యొద్దకేఁగియడుగు"డనెను.

వారచ్చటికి వెళ్ళిరి. వాఁడుకప్పుకొని పరుండెను. వీరి మాటల యలికిడికిలేచి వాఁడు వీరితో "మీకేమి కావలె" నని పుస్తూభాషలో నడిగెను.

"మేము ప్రయాణీకులము. ఈ రాత్రి సత్రములో నుండవలెనని వచ్చితిమి" అని రహమతుఖాను జవాబిచ్చెను.

సి. ఐ. డి. ఈ మాటలను నమ్మలేదు. వాఁడు "మిమ్ములను చూచిన ననుమానము కలుగుచున్నది. రండి పోలీసు అధికారియొద్దకు" అనెను.

కథ అడ్డముతిరిగి పోవునని భయపడి రహమతుఖాను వానిని బ్రతిమాలెను. "మావంటి ప్రయాణికులను ఇబ్బంది పెట్టుట న్యాయమేనా? సఖీసాహెబుకు వెళ్ళురోడ్డునిండ మంచు నీరు ప్రవహించుటవలన నా రోడ్డుపై నెవరినికూడ పోనిచ్చుటలేదు. ఆ రోడ్డు తెరచువరకు ఇక్కడ బస చేయుదుము" అని యెంతో బ్రతిమాలెను.

కాని యా సి.ఐ.డి.కి జాలికలుగలేదు. రహమతుఖాను ధైర్యముతో "సరే పదనయ్యా! కొత్వాలు (పోలీసు అధికారి) వద్దకు నేనేవచ్చెదను. మాయన్నయ్యకు జబ్బుగా నున్నది. అతఁడురాఁడు" అని బిగ్గరగా కేకలుపెట్టెను. అంతటితో వాఁడు మెత్తబడి యేకోన్ని బూతుమాటలాడి విసుగుకొని "సరే రేపు వెళ్ళండి. ఇప్పటికి దయతలచితిని" అని మరల టీ త్రాగవలెను, డబ్బులేమైనా" ... ...అని చెయ్యిచాచెను.

రహమతుఖాను వాని పీడ వదలించుకొనుటకు ఆఫ్ఘను ప్రభుత్వపు పదిరూపాయలనోటు వానికిచ్చెను. మరల మూఁడు రోజులకు గూఢచారి ప్రత్యక్షమై నిల్చినాఁడు, అప్పుడు రహమతులేడు. బోసుమాత్రమే చీకటికొట్టులో కూర్చున్నాఁడు వాఁడు పుస్తూభాషలో నేదియో ప్రశ్నలు వేయుచున్నాఁడు. బోసు మాట్లాడలేదు. చూడలేదు. బోసును చెవిటివాఁడని, మూగవాఁడని నమ్మి యూరకయిటునటుతిరుగ సాఁగెను.

కొలది నిమిషములకే రహమతు వచ్చెను. ఈ సారి సి. ఐ. డి. యెంతో సంతోషముతో మాటాడెను. "మీ కింకను సఖీసాహెబుకు వెళ్ళు బస్సుదొరకలేదా!" అనెను. రహమతు- "ఇప్పుడక్కడ నుండియే వచ్చుచున్నాను. మేము వెళ్ళుటకు ఏ మాత్రమైనా వీలున్న నిచ్చట యెందుకుందుము!" అని నిర్భయతతోఁ జెప్పెను. కాని యా నీచుండేవేవో కొన్ని మాటలు కొంత నిర్బంధము చేసి చివరకు రహమతుఖాను నుండి మరల నైదురూపాయలు తీసికొని వెళ్ళెను.

వారు "రోజురోజు ఇలా పీక్కొని తినువానికి మన మెన్నాళ్ళు లంచముపెట్టగలము!" వాని పీడ నదలించుకొనుటకు వేఱుగ మఱియొక చోటునకు పోనవలెనని ప్రయత్నించిరి. కాని యక్కడ నింకొక సి.ఐ.డి. బాధించిన నేమి చేయవలెనని విచారపడిరి.

ముందు మిత్రులు కాబూలునుండి వెంటనే బయలు దేరి వెళ్ళు నదుపాయములు చేయక పోయిరేకదా యనియు విచారించిరి. ఒకవేళ వారు ప్రయత్నములు చేయుచున్నను వీరికి ప్రస్తుతముపకరించునది యొక్కటియు లేక పోయెనుకదా!

రహమతుఖాను బోసుతో "కాబూలులోను త్తమ చందు ఒక వర్తకుఁడు. మనలనువాఁడు రక్షింపఁగలఁడు. చాల మంచివాఁడని" చెప్పెను. కాని "ముందుగా నీ యేర్పాటులు కుదుర్చుకొనక యేలవచ్చితిరని కోపగించునేమో ఉత్తమచందు" అని రహమతు వానియొద్దకేగుటకు భయపడెను.

మేడమీఁదియొక్క కొట్టుచూపించి, రోజుకొక రూపాయి అద్దెయని కావలావాఁడు చెప్పెను.

జైళ్ళలో కఠినశిక్షలవారికికూడ అంతటి చీకటికొట్టు నివాసము కల్పింపరు. తలుపుమూసినచో రాత్రి, పగలు భేదము తెలియదు. కాని వారున్న క్లిష్టపరిస్థితినిబట్టి యా చీకటి కొట్టుతప్ప వారికి మరొక తావుదొరకలేదు. బోసు ఆ చీకటిగదే బాగుండునని యెంచెను. "పరులెవ్వరువచ్చి నను చీకట్లో చప్పున గుర్తుపట్టరు" అని బోసుగారు సంతోషించెను. కాని క్రింద పరుండుటకు వీలులేదు. చలిబాధవలన ప్రాణములే పోవును. "పరుండుటకు పరుపులు దొరకునేమో అడిగిరమ్మ"ని రహమతుఖానును పంపెను. "పరుపునకు రోజుకు అర్ధరూపాయి అద్దెయగు"నని కావలావాఁడనెను. రహమతుఖాను రెండు పరుపులు తెచ్చెను.

రహమతుఖానువెళ్ళి కొన్నికట్టెలుకూడ తెచ్చెను. అవితడిమొద్దలు వానికినిప్పురగిల్చిరి. పొగకు కళ్లుపోవుచున్నవి. ఎంతసేపటికిని మండలేదు కొంతసేపటికి కష్టపడి మంటచేసిరి. వారిచలిబాధ కొంతవఱకు తీరినది.

రహమతుఖాను అప్పుడేబజారుకువెళ్ళి కొన్నిరొట్టెలు, కొవ్వువత్తులు తెచ్చెను. ఆ రొట్టెలు బోసునకు రుచింపలేదు. రహమతుఖాను మరలవెళ్ళి టీ తెచ్చెను. రొట్టెను అందులో నానవేసి యెట్లో ఆరోజు తినగల్గిరి.

ఆ రాత్రి వారికచట బాగుగా నిద్రపట్టినది. ఉదయమున లేచిరి. కాని వారునడచి నడచి వచ్చిరికనుక కాళ్లుతీపులు తీయసాగెను. ఉదయము టీతో బాటు రొట్టెలుతినిరి. చలి బాధ యెక్కువగా నున్నది తెల్లవారినను వారుతలుపులు తీయక యెట్లుండగలరు? మంచు వర్షము విపరీతము. దానితో బాటు చలివిసురు మఱియు నధికమయ్యెను.

రహమతుఖాను రెండుతోలువెయిస్టుకోటులు, ఒక కెటిలు రెండు చిన్నతివాసీలు కొనితెచ్చెను. సత్రమునెదుట నొక ముస్లిము దుకాణము కలదు. అచటవారు టీ రొట్టెలుకొని తిన మొదలుపెట్టిరి.

రహమతుఖానుకు ప్రతిరోజుదుకాణములో ఒక వ్యక్తి తెల్లని దుస్తులలో కనిపించుచుండెను. అతడు ఆఫ్ఘన్ సి. ఐ. డి. అయియుండునని రహమతు ఖానుకు అనుమానము కలిగినది. వాడు పర్షియను భాషలో రహమతు ఖానును గురించి దుకాణపువారినడిగి తెలిసికొన ప్రయత్నించెను. కాని వారికి మాత్రము వారిసంగతియేమి తెలియును? కానియెక్కడ నుండునని మాత్రము తెలిసికొనిఆగదివాకిట ప్రత్యక్షమయ్యెను.

పుష్తూభాషలో "మీరెవరు? ఇక్కడి కెందుకు వచ్చితిరి" అని గద్దించుచు అడిగెను. "మేముసరిహద్దు తెగకు చెందిన ప్రయాణీకులము. ఇతడు మాయన్న. ఇతడు చెవిటి వాడు, మూగవాడుకూడ పాపము జబ్బుగానున్నాడు అందుచేత సఖీసాహెబ్ దర్శనము చేయించుదమని తీసుకొని పోవుచున్నాను" అని రహమతుఖాను జవాబిచ్చెను.

సి. ఐ. డి. ఈ మాటలను నమ్మలేదు. వాఁడు "మిమ్ములను చూచిన ననుమానము కలుగుచున్నది. రండి పోలీసు అధికారియొద్దకు" అనెను.

కథ అడ్డము తిరిగి పోవునని భయపడి రహమతుఖాను వానిని బ్రతిమాలెను. "మావంటి ప్రయాణీకులను ఇబ్బంది పెట్టుట న్యాయమేనా? సఖీసాహెబుకు వెళ్ళు రోడ్డునిండ మంచు నీరు ప్రవహించుటవలన నా రోడ్డుపై నెవరిని కూడ పోనిచ్చుటలేదు. ఆ రోడ్డు తెరచువరకు ఇక్కడ బస చేయుదుము" అని యెంతో బ్రతిమాలెను.

కాని యా సి.ఐ.డి.కి జాలికలుగలేదు. రహమతుఖాను ధైర్యముతో "సరే పదనయ్యా! కొత్వాలు (పోలీసు అధికారి) వద్దకు నేనే వచ్చెదను. మా యన్నయ్యకు జబ్బుగా నున్నది. అతఁడు రాఁడు" అని బిగ్గరగా కేకలు పెట్టెను. అంతటితో వాఁడు మెత్తబడి యేవో కొన్ని బూతుమాటలాడి విసుగుకొని "సరే రేపు వెళ్ళండి. ఇప్పటికి దయతలచితిని" అని మరల టీ త్రాగనలెను, డబ్బులేమైనా" ... ...అని చెయ్యిచాచెను.

రహమతుఖాను వాని పీడ వదలించుకొనుటకు ఆఫ్ఘను ప్రభుత్వపు పదిరూపాయలనోటు వానికిచ్చెను. మరల మూఁడు రోజులకు గూఢచారి ప్రత్యక్షమై నిల్చినాఁడు, అప్పుడు రహమతు లేడు. భోసుమాత్రమే చీకటికొట్టులో కూర్చున్నాఁడు. వాఁడు పుస్తూభాషలో నేదియో ప్రశ్నలు వేయుచున్నాడు. భోసు మాట్లాడలేదు. చూడలేదు. భోసును చెవిటివాఁడని, మూగవాఁడని నమ్మి యూరక యిటునటు తిరుగసాఁగెను.

కొలది నిమిషములకే రహమతువచ్చెను. ఈ సారి సి. ఐ. డి. యెంతో సంతోషముతో మాటాడెను. "మీ కింకను సఖీసాహెబుకు వెళ్ళు బస్సుదొరకలేదా!" అనెను. రహమతు– "ఇప్పుడక్కడ నుండియే వచ్చుచున్నాను. మేము వెళ్ళుటకు ఏ మాత్రమైనా వీలున్న నిచ్చట యెందుకుందుము!" అని విధేయతతో జెప్పెను. కాని యాసీచుండేవేవో కొన్ని మాటలు కొంతనిర్బంధముచేసి చివరకు రహమతుఖాను నుండి మరల నైదురూపాయలు తీసికొని వెళ్ళెను.

వారు "రోజురోజు ఇలా పీక్కొని తినువానికి మన మెన్నాళ్ళు లంచము పెట్టగలము!" వాని పీడ వదలించుకొనుటకు వేఱుగ మఱియొక చోటుకు పోనవలెనని ప్రయత్నించిరి. కాని యక్కడనింకొక సి.ఐ.డి. వాపరించిన నేమి చేయవలెనని విచారపడిరి.

ముందు మిత్రులు కాబూలునుండి వెంటనే జయుల దేరి వెళ్ళు సదుపాయములు చేయక పోయినకదాయనియు విచారించిరి. ఒకవేళ వారు ప్రయత్నములు చేయుచున్నను వీరికి పరిస్థితముపకరించునది యొక్కటియులేక పోయెనుకదా!

రహమతుఖాను బోసుతో "కాబూలులోను త్తమ చందు ఒక వరకుఁడు. మనలనువాఁడు రక్షింపఁగలఁడు. చాల మంచివాఁడని" చెప్పెను. కాని "ముందుగా నీ యేర్పా టులు కుదుర్చు కొనక యేలవచ్చితిరని కోపగించునేమో ఉత్తమచందు" అనిరహమతు వానియొద్దకేగుటకు భయపడెను.

బోసు రహమతుఖానుతో “ఇంకనిచ్చటనే యున్నచో తప్పక నిర్బంధము పాలయ్యెదము. వెంటనే ఉత్తమచందును కలిసికొని మాటాడిరమ్ము” అనెను. రహమతుఖాను వెంటనే బయలు దేరెను.

## ఉత్తమచందు దుకాణము:

ఉత్తమచందు పత్రికాపఠన మనిన చెవికోసికొనును. బోసు అంతర్ధాన మయినసంగతి రేడియోవలనఁ దెలిసి నప్పటినుండి పత్రికలు చూచుట మఱింత యెక్కువయినది. బోసు అంతర్ధానమునుగూర్చి తలకొక యూహాగావించిరి.

కొందరు “జపానునకు పోయె” ననిరి. కొందరు “రష్యాకు పోయె” నని తలఁచిరి. కొందరు బ్రిటిషువారి కుతంత్రములో మ్రగ్గెనని యెంచిరి.

## క్రొత్త వ్యక్తి:

ఉత్తమచందు పత్రిక చదువుచుఁ దనదుకాణములోనికి క్రొత్తవ్యక్తి వచ్చుటచూచి పత్రికనుమూసి “సలాం” మని గౌరవించెను. రహమతుఖాను పెషావరు సాల్వారుదుస్తులు ధరించెను. ఖాకీచొక్కా తొడిగెను. చిన్నకోలుకోటుకూడ తొడుగుటవలనను, పఠానుమాదిరి తలపాగా చుట్టుటవలనను పెషావరు కాలిజోడు తొడుగుట వలనను, సరిహద్దు ప్రాంతములోని కొండజాతివాఁడా యన్నట్లుండెను. ఉత్తమచందు

రహమతుఖానును గూర్చుండుడని "నావలన మీకేమిపని కావలె"ననెను. ఉత్తమచందుఅన్న మీరేనా? అని బెదురుచు రహమతుఖాననెను. ఆశ్చర్యముతో నుత్తమచందు ఔనని జవాబిచ్చెను.

ఉత్తమచందు:- "నావలనమీకేమి పనికావలసి వచ్చితిరి" అని మరల నడిగెను.

రహమతుఖాను- ఇటునటు చూచుచు దుకాణములో పదునైదు సం॥ వయస్సు బాలుఁడు పనిచేయుటచూచి యేమియు మాటాడలేక కూర్చుండెను.

ఉత్తమచందు అదిగమనించి "అమరనాధ్! ఆ ముసల్మానుల హోటలుకు పోయి టీ తీసికొని రా, పో," యనెను. వాఁడు వెంటనే డబ్బుతీసికొని వెళ్ళిపోయెను.

రహమతుఖాను "నేను భారతీయుఁడను. రాజకీయ కార్య భారముపై నిక్కడకు వచ్చితిని. మీ సహాయము కావలెను" అనెను.

ఉత్తమచందు:- "మీ పేరేమి? మీకేమి సహాయముకావలె" ననెను. రహమతుఖాను "నేను మర్దాన్ జిల్లా ఘల్లాధేర్ నివాసిని. నా పేరు భగత్ రాము. పంజాబుగవర్నరును తుపాకితోఁగాల్చ ప్రయత్నించినవ్యక్తికి నేనుసోదరుఁడను" అనెను ఆ మాటలువిని ఉత్తమచందు తనలో నిట్లనుకొనెను, "ఈ భగత్ రాముఇల్లు మా అత్త పుట్టింటివారి యింటిప్రక్కనే యుండుటవలన నా పేరు వీనికి తెలిసియుండును. నేను 1930లో

వనజవాన్ భారతసభ ప్రధానకార్యదర్శిగా నున్నప్పుడుఅరెష్టు చేయఁబడుట ఇతనికి తెలిసియుండును. అప్పుడు ఈ భగత్ రాముకూడ ఆ సభకొక సభ్యుఁడై యుండెను. అందువలన నన్ను గుర్తించి నావలన సహాయముకోరివచ్చె"నని తలఁచెను

## కార్యభారము

ఉత్తమచందు– "మీరువచ్చిన పనియేమిటి? నేను సహాయమేమి చేయవలెను?" అనెను. భగత్ రామ్– "ఆఫ్ఘనిస్థాను సరిహద్దుదాటించి రష్యాకు పంపివేయవలెనని సుభాసు చంద్రబోసును నాతో వెంటఁబెట్టుకొని వచ్చితిని. ఇఁకనిప్పుడు అని మీఁదనేమి చెప్పవలెనో తోఁచక మౌనము వహించెను.

ఉత్తమచందు:–"సుభాసుబోసు ఇక్కడకు వచ్చెనా?" యని నిర్ఘాంతపోయెను, గుండెదడదడ కొట్టుకొన్నది. అప్పుడె ఒకఁడు దుకాణములో నేదోకొనుటకు వచ్చెను. ఆ వస్తువు లేదని వానిని వెంటనే పంపించెను.

"అయితే ఇప్పుడేమి జరిగినది?" అని యుత్తమచందు ఆతురతతో నడిగెను. భగత్ రామ్– "మేము ప్రస్తుతము ఒక సత్రములో నున్నాము. కాని కాబూలువాఁడు మమ్ము వెంటాడుచుండెను. అతఁడు ఆఫ్ఘను సి. ఐ. డి. యని మా యనుమానము. అతఁడనేక ప్రశ్నలు వేయుచున్నాఁడు. ఈ చిక్కునుండి మమ్ములను తప్పింప వలసినదని బోసుమిమ్ములను కోరుచుండెను" అనెను.

ఇంతలో అమరనాథ్ టీతో ప్రవేసించెను. వారు ప్రస్తుభాష మాటాడుటమాని ఉర్దుభాషలోనికిదిగి మాటాడుట మొదలిడిరి. ఉర్దుభాష అమరనాథునకు తెలియదు.

భగత్‌రాముతో "బోసుబాబు మిమ్ములను పంపుటకు నేను బోసుబాబు నెఱుగను. వారికి మాత్రమును నాజాడ యెట్లు తెలిసినది?" అనియుత్తమచందు ప్రశ్నించెను.

భగత్‌రాము ఉత్తమచందుతో "మీరు నవజవాన్ భారత సభలో పనిచేయుచున్నప్పుడు మిమ్ములను రెండు మూడు పర్యాయములు చూచియున్నాను. నేనునొక సభ్యుఁడనుక నుక నాపేరు మీరువినియుందురు. 1930లో మీరరెస్టు అగుట రెండేళ్ళు కఠినశిక్ష విధింపబడిన సంగతి నాకు తెలియును. మీరిచ్చట దుకాణముపెట్టుకొని యున్నట్లు మీ మేనమామవలన వినియున్నాను. మిమ్ములను మీ న్యాయ ప్రవర్తనను, బోసుబాబునకు తెలియపరచినాను. అందువలన మిమ్ములను వారునమ్మి వారిరక్షణము మీ వలన తప్పక అగునని విశ్వసించి నన్నుఁబంపిరి" అనెను.

క్లిష్ట పరిస్థితి:

ఉత్తమచందు- "మీ సంభాషణములో నా ప్రసక్తి రావలసిన కారణమేమివచ్చినది?" అనెను. భగత్‌రాము "మీ ప్రసక్తి ప్రత్యేకముగా నే సందర్భములోగూడ రాలేదు. కాని మేము ఇక్కడికివచ్చి యిరుకులో పడితిమి. ఈ గండము

నుండి తప్పించుకొను నుపాయము నాలోచించితిమి. అన్నిటిని విచారించి ప్రస్తుతము సి. ఐ. డి. నుండి తప్పించుకొని వేఱు మకాము పెట్టుటకు ఆలోచించితిమి. ఎక్కడ? ఎవరు పరిచితులు? అని యాలోచింపసాగితిమి. మీరు 1930 సం॥లో జైలునకు వెళ్ళుటం మీ దేశభక్తి జ్ఞాపకమువచ్చినది. అందువలన మిమ్మాశ్రయించ వచ్చితిమి" అనెను.

ఉత్తమచందు- "ఇన్నాళ్ళనుండి యిక్కడనున్నారు కదా! ఏందువలన మీప్రయత్నము సాగినదికాదు?" అని ప్రశ్నించెను.

## రష్యన్ రాయబారి - నిరాశ:

మేమిక్కడకువచ్చి పదమూడురోజులయినది. ఆసత్రపు గది యారోగ్యకరమయినదికాదు. దాని చుట్టును ఒంటెలు గుఱ్ఱములు, ప్రయాణపుబండ్లు, వారిప్రజలు మూగుదురు. దుర్వాసన అటుండగా నూతుప్రక్క యిక్కట్టు సి.ఐ.డి. తాకిడి.

రష్యను రాయబారిని కలసికొని మాటాడవలెనని ప్రయత్నించితిమి. కాని యాకార్యాలయములోనికి పరులనెవ్వరిని పోనిచ్చుటలేదు.

ఒక రోజున రష్యాజెండాతో నొకకారు వెళ్ళుచుండ దానినాపి వెనుకసీటులోకూర్చున్న పెద్దమనుష్యునితో పర్షియను భాషలో తడబడుచు బోసుబాబును గురించి చెప్పితిని. నాకు పర్షియనుభాష బాగారాదు. ఆయన చెప్పినదిమాత్రము నాకు

తెలిసినది. "ఆవ్యక్తి సుభాసుచంద్రబోసు అని నాకు నమ్మ. కమెలా కలుగుతుందో చెప్పు!" మని రమ్యను రాయబారి ప్రశ్నించెను.

ఆ ప్రశ్నకు సరిగా మేము రుజువుచేయగల యాధారములు లేవు. మేము తెల్లముఖము వేసితిమి. కావునకదలిపోయినది.

ఆహా! బోసువంటి మహానాయకునకుఁగూడ గుర్తులతో గూడిన ప్రమాణ పరిచయ పత్రము కావలసి వచ్చెనుకదా! అని భగత్ రాము నిశ్చేష్టుఁడైనాఁడు.

భగత్ రాముతో "మీకు వర్యనుభావ సరిగా రాక పోవుట చేతను, మీరుఫలానా యని రాయబారిని పరిచయము చేయువారు లేకపోవుట చేతను, మీ ప్రయత్నముకొనసాఁగలే" దని యుత్తమచందు చెప్పెను.

రాయబారులతో సరిగావ్యవహారము చేయఁజాలని వ్యక్తినిచ్చి బోసుబాబును కాబూలుకు పంపినవారి తెలివి తేటలకు ఉత్తమచందు ఆశ్చర్యపడెను. వర్షన్ను, రమ్యను భాషలు వచ్చినవారిని వెంటఁ బంపినచో నిన్ని యిక్కట్టులు రాకపోవునుగదా! యని విచారపడెను. "రమ్యను రాయబారి కార్యాలయముతో సంబంధముగల వారినైన పంపవలసినదిసుమా" యని తనలో నుత్తమచందు పలువిధముల నాలోచించెను.

## ఇటాలియను రాయబారి:

తరువాత భగత్‌రాము మరల "మేమురష్యాను రాయబారి ఆశవదలుకొని యిటాలియను రాయబారిని కలిసి కొన ప్రయత్నించినాము. ఇటాలియను రాయబారితో మాటాడినాము". ఆయనమాతో "మాకు వీలుచిక్కినప్పుడు తప్పక బోసును బెర్లినుకో, రోముకో, తీసికొనిపోవుదు" మనెను.

తరువాత భగత్‌రామువలన బోసుకథసమగ్రముగా వినియుత్తమ చందు "తప్పక రాయబారులతోఁ గలసికొను సహాయము చేయింతు"నని వాగ్దానమిచ్చి తన యింటిలో నివాసమేర్పర్చుకొనుటకు అంగీకరించెను.

"చీకటి పడిన వెంటనే మీరాసత్రములో నున్న సామానుతోఁగూడవచ్చి మాఇంటిలో నుండు"డనియు "మీకు కావలసినసదుపాయములు తప్పక చేతు"నని యుత్తమచందు సంతోషముతోఁ జెప్పెను.

భగత్‌రాముబోసుతో జరిగిన సంగతి తెల్పి యానంద పడెను. అంతలోమరల సి. ఐ. డి. వచ్చి సరాసరి వారి పరుపులమీఁద కూర్చుండెను. పలుమాటలతో భయపెట్టెను.

అనేక విధములవారు అతనిని బ్రతిమాలిరి. లంచ గొండులు బ్రతిమాలుటతో విడిచిపోవుదురా? సి. ఐ. డి. చూపు భగత్‌రాముచేతినున్న గడియారము మీఁదపడినది. కాని ఖరీదడిగి నాఁడు. సి. ఐ. డి. "వానికిది వదలిన వాఁడు

వదలిపోవు" నని తలంచి సి. ఐ. డి. కి ముంజేతి గడియారము నిచ్చివేసెను. అంతటితో నాలంచగొండి తృప్తిపడి వెళ్ళినాఁడు.

సత్రప్రక్రియనలసిన ఆదెరిచ్చి ఉత్తమచందునింటిలో దాగుకొన్నారు. నడకవలన బోసుకు రక్తాతిసారము పట్టుకున్నది. చాలశ్రమతో చికిత్సనుబొంది ఆరోగ్యమును సంపాదించెను.

వారు మరల రష్యనురాయబారితో మాట్లాడ దలంచినారు. అది కొనసాఁగ లేదు. ఇటాలియను రాయబారితోను సంప్రతింపులు చేయఁదలంచిరి. అదియు కాలేదు.

"హెర్ థామస్" ఒకజర్మనువ్యక్తి. ఆఫ్ఘనిస్థానములో వ్యాపారముకై యుండెను, ఇతని సహాయముతో ఇటలీ రాయబారిని కలసికొని సంగతిఁదెల్పిరి. అతఁడు ఇటలీ ప్రభుత్వముద్వారాగాని, జర్మను ప్రభుత్వముద్వారాగాని వీరికి సహాయము జేయుదునని మాటయిచ్చెను.

బోసు ఆఫ్ఘనిస్థానములో ఉత్తమచందునింటిలో నలుబదయిదు రోజులుండెను. జర్మనునుండి పాస్పోర్టు వచ్చినది. బోసుఇన్నిదినములు తననుదాచి యుంచినందుకు ఉత్తమచందు కుటుంబమునకు కృతజ్ఞత వెలిబుచ్చెను. మార్చి 18 తేదీని ఉదయము 9 గంటలకు కాబూలునుండి మోటారుమీఁద ప్రయాణమై రష్యాసరిహద్దు చేరుకొని మరు నాఁడు ఉదయము దానినిదాటి మార్చి20వ తేదీని మాస్కోకు

రైలులో బయలుదేరెను. అప్పుడే రహమతుల్ ఖాను కాబూలు నుండి ఇండియాకు తిరిగివచ్చెను. పాస్పుపోర్టుతో బాటు బోసు ఫోటో కూడ ఉండెను.

బోసు మార్చి 27 తేదీకి జర్మనుచేరెను. బోసుకుహిట్లరుతో మంచిపరిచయము కుదిరెను. బోసుక్రమశిక్షణను, బుద్ధి వికాసమును మెచ్చి హిట్లరు గౌరవ నందనము చేయుచుండెడివాడట "మీ వలననే భారతదేశము స్వాతంత్ర్యము గాంచు"నని బోసును హిట్లరు కొనియాడెడువాడట.

జర్మనీలో అజాద్ హిందు రేడియోనుండి బోసు దీర్ఘోపన్యాస మిచ్చుచుండెను. అచ్చటను అజాద్ ఫౌజును నెలకొల్పెను. వారికి సైనిక శిక్షణ గరపెను.

బోసుకు హిట్లరు ఒకపెద్దభవనము నివాసముగా నేర్పాటు చేయించెను. అజాద్ ఫౌజుకు యేమికావలసినను జర్మను ధనికులు సహాయము చేయుచుండెడివారు. బోసుకొక కారునిచ్చిరి. ఆ కారుపైనను తనభవనము పైనను ఒకజాతీయ పతాక ఎగురుచుండెను.

అవి జర్మనీ రష్యాలకు యుద్ధముసాగుచున్న రోజులు. బోసు భారతదేశ స్వాతంత్ర్యసిద్ధికై హిట్లరు అనుమతిని హాలెండులోని కీరాయను రేవుపట్టణమునుండి సబ్ మెరైనులో బయలుదేరి జపాను దేశము చేరెను.

1942 సం॥ ఫిబ్రవరి 15 తేదిని సింగపూరు పతనమైనది. అప్పుడు బ్రిటిషువారి భారతీయ సైనికులు జపానుకు పట్టుబడి తీసుకొనిపోబడినవారు కొన్నివేలు.

ఈ సైనికులను అపరిభుత్వానుమతిని, భారతదేశ స్వాతంత్ర్య సిద్ధికై యుపయోగించుటకు బోసు తగుకట్టు బాట్లతో విడిపించి తన స్వాధీనములో నడిపించి మఱికొందరి భారతీయులకు సైనిక శిక్షణమిచ్చెను.

ఈ ఫౌజు నిర్మాణమున కచటి భారతీయులు కోట్ల కొలంది ధనము విరాళమిచ్చినారు. బోసు సైనిక శిక్షణకును, అతని సునిశిత బుద్ధికిని మెచ్చి, జపాను ప్రభుత్వముచే అండమానుదీవులు, నికోబారుదీవులు బోసునకిచ్చివేయఁబడినవి. ఇతని యధికారమును జర్మని, జపాను, ఇటలీ, థాయిలాండు, ఫిలిప్పైన్సు, క్రొయేషియా, మంచూరియా, బర్మా ప్రభుత్వము లంగీకరించి తమ తమ రాజ్యముల పక్షమున రాయబారుల పంపుకొనిరి.

బోసు అజాద్ హింద్ ప్రభుత్వమును స్థాపించిన పిదప అజాద్ హింద్ ఫౌజుకు చెందిన రెడ్‌క్రాస్ శాఖకు అయిర్లెండు ప్రధాని మిష్టర్ డి. వెల్‌రా 5000 పౌనులు విరాళమిచ్చెను.

జపాను సైనికులకును, వారియుద్యోగులకును, బోసెదురైనను, ఫోటో యెదురైనను నమస్కరించి ముందుకుపోవుట ఆచారమయ్యెను.

హిందూ దేశమునకు సంపూర్ణస్వాతంత్ర్య సంపాదనమె ఫౌజు ముఖ్యాశయము. వారి పతాకముకూడ త్రివర్ణపతాకమే.

ఈ ఫౌజునుండి బర్మాలో "జైహిందు" అను వార పత్రికయు, "పూర్ణస్వారాజ్య" యను దినపత్రికయు ప్రకటింపఁ బడుచుండెడివి.

ఈ ఫౌజు జపాను ప్రభుత్వమును ఇండియామీఁద దండెత్త నీయకుండఁ జేసెను. అజాద్ ఫౌజుకు కావలసిన మందుగుండు సామగ్రి టాంకులు మొదలైనవి లేవు. వాసికై బోసు స్వతంత్రభారతప్రభుత్వమునుండి చందాలమూలమునను, విరాళముల మూలమునను వసూలైన పెద్ద పెద్ద మొత్తములు జపాను ప్రభుత్వమునకుబంపి, వారికడనుండి యాయుధములు టాంకులు మొదలగునవి కొనియుంచెడువాఁడు.

ఫౌజులో మతభేదములు లేవు. అందఱొక్కబంతిని భుజించుట వాడుక అయినది.

ఫౌజుబలము సంఖ్య 43 వేలట. ఇందుఇరువది వేలమంది శత్రుమాత్రమె భారతీయ సైనికులు (బ్రిటిషుపక్షపువారు)

అజాదు హిందు ఫౌజు మతమొక్కటే. అది విశ్వాసము. ఐకమత్యము, త్యాగము, ప్రధాన సూత్రములు. అందఱు త్రివర్ణ పతాకము క్రింద చేరవలసినదే. దాని లక్ష్య మొక్కటే భారత స్వాతంత్ర్యము. దానివాంఛ ఒక్కటే

విజయమో వీరస్వర్గమో. దానియుద్ధసినాదవాంఛ ఒక్కటే- "ఢిల్లీ చలో" దాని నాయకుఁడొక్కడే- నేతాజీ. దానిమార్గ మొక్కటే- ఢిల్లీమార్గము. దాని గమ్యస్థాన మొక్కటే- లాల్ ఖిల్లా. దాని దేశమొక్కటే- హిందుస్థాన్. దాని నమస్కార మొక్కటే జైహింద్. దాని శతృత్వ మొక్క-దాని పయి నే- భారత స్వాతంత్ర్యసిద్ధికిఁగల నిరోధముపై. దాని వజ్రాయుధ మొక్కటే ఆత్మ బలము. ఇవి ఆఫౌజునకుఁ దెలియఁ బఱచిన సప్తసూత్రులు.

43 వేల సైనికులును 5 దళములుగా విభజింపఁబడిరి. ఆ దళములకు ప్రత్యేకముగా దళాధిపతులు. వారు వారి దళములను నడిపించిరి. నాయకుఁడు త్రివర్ణపతాకమును భుజమున ధరించి జైహింద్, ఢిల్లీచలో అను వీరసినాదములు దిక్కులు పిక్కటిల్లఁజేయుచు, తమపాదఘట్టనమున భూమిని క్రుంగఁజేయుచు, వీరరసముప్పొంగ అజాద్ ఫౌజును నడిపించిరి.

బోసుసర్వసైన్యాధి నాయకుఁడై తనకార్యాలయమున, తత్సమీప భారతీయులను సైన్యములోనికి ఉసికొల్పుచు, వెంటవెంట వారికి సహాయము బంపుచుండెను.

## నేతాజీ ఉపన్యాసము:

రంగూను జూబిలీహాలునద్ద ఒక బహింగసభ జరిగినది. వేలకొలది స్త్రీలు, పురుషులు శిశువులు, నేతాజీ మహోపన్యాసనమును వినుచున్నారు. ఆయన ఉపన్యాసమును ముగింపఁబోయి యిట్లన్నాఁడు-

బ్రిటిషువారు అప్పటున బోసుపేరువిని ఉలిక్కిపడు చుండెడువారు. నిద్రలో కలవరింతలు, గుండెలదడదడ, బెదరు బెదరు చూపులు, కలిగి కలత నిద్రతో లేచుచుండెడివారు. బోసు బ్రిటిషువారికి సింహస్వప్నమయ్యెను.

భారతదేశ స్వరాజ్యసిద్ధికి అన్ని తిరుగుబాట్లు కారణములే. కాని బోసుచేసిన ప్రతిఘటనము ముఖ్యకారణమని వేఱుగాఁ జెప్పవలెనా?

బాలకులారా! బోసువలె నుత్తమ నాయకులై స్వార్థత్యాగులై దేశభక్తులై వీరులై కీర్తి నార్జింపుడు. ఉత్తమ నాయకులై ప్రజల బాధలను బోగొట్టుఁడు. పరమత సహనము గలిగి యుండుఁడు. నిరక్షరాస్యతను, నిరుద్యోగితను నిర్మూలింపుఁడు. సభ్యమానవజాతిలో భారతీయ విజ్ఞాన సంపత్తిని ప్రకాశింపఁ జేయుఁడు. బీదసాదలను దయతోఁ జూడుడు. జాతిమతకుల విచక్షణతలేక సర్వమానవ సోదరభావము కనంబరచుఁడు. విద్యార్థిదశయందే రాజకీయములను తలపోయకుఁడు ఉన్నత విద్యయందారితేరి జాతీయనాయకులై విరాజిల్లుఁడు. దేశసేవకై యెన్నియో కష్టముల నెదుర్కొనుఁడు. భారతదేశస్వాతంత్ర్యమును పరిరక్షింయత్తము కానియకుఁడు. పౌరుషమును జూపి మీ సర్వస్వమును త్యాగముచేయుఁడు మంచి ఆదర్శ నాయకులనే పేరొందుఁడు. బోసువంటి యుత్తమనాయకుల చరిత్రమును మరచిపోకుడు.

---

# ౩. భీష్ముఁడు

ఆ. వె. తనదు రాజ్యమెల్లఁ దమ్మునకుఁ జేసి తా
బ్రహ్మచర్యమనెడు వ్రతముఁ బూని
స్థిరమనస్కుఁడగుచు దేవవ్రతుండును
భీష్ముఁడనుచుఁ బెద్దపేరుఁ గాంచె.

బాలకులారా! భీష్ముని చరిత్రము నేఁ గొంతయైనఁ దెలుసుకొనియె యుందురు. తండ్రి సుఖమును మాత్రమె కోరి తన సర్వసుఖములను విడనాడి మహాత్యాగియని దేవతల చేతను స్తుతులనందెను. ఇట్టి త్యాగమూర్తులు మన ప్రపంచము నందు బహుకొద్దిమంది మాత్రమె యుందురు. ఇప్పటిమన దేశీయనాయకుల యందును కొందరియందు నిట్టి త్యాగము గలదనుటలో సందేహము లేదు. దేశము బాగుపడవలెననినచో ప్రజలు సుఖముగా నుండవలెననినచో, నట్టిమహానాయకులు, అట్టి మహారాజులును, స్వార్థత్యాగులయి కీర్తికాములయి యుండవలెను. అట్టి మహాత్ముఁడయిన భీష్ముని చరిత్రమును వినుఁడు.

కౌరవ వంశంబునందు శంతనుండను మహారాజు కలఁడు. ఆరాజు న్యాయముఁదప్పక రాజ్యమేలుచుండెను. ఒకనాఁడు వేటకై వెడలెను. అది గంగానదీ సమీపారణ్యము.

వేటచే నలసి సొలసి యొంటరియై రాజు గంగానది లోని యిసుకతిన్నెలమీఁద సంచరింపఁదొడఁగెను. అల్లంత

దలంచితిమి. మమ్ము పుట్టిన వెంటనే ముక్తులం గావింపుము. పాపముతోఁగూడిన భూమియందు మేము చాలకాలము మనుజులమై యుండఁజాలము. మమ్మనుగ్రహింపు" మనిరి.

నేను వారితో "వసువులారా! మీరు వశిష్ఠ మహర్షి కేమియెగ్గుచేసితిరి. వారు మిమ్మేమని శపియించిరి" అంటిని.

వారునాతో "గంగాదేవీ! మేము మా భార్యలతో నాతపోధనుని వనమునకుం బోయితిమి. దేవతలకు వనవిహారము మిక్కిలి సంతోషమయినదికదా! ఆవనమావనము తిరుగుచు క్రమముగా వశిష్ఠ మహర్షి వనముఁ జేరుకొంటిమి. అచ్చట కామధేను సంతానమైన నందినీ ధేనువుంజూచితిమి, దాని మహిమ కాశ్చర్యపడితిమి.

మాలోని యష్టమవసువగు ప్రభాసునిభార్య యా నందినీ ధేనువుందీసుకొనిపోవఁ బట్టుపట్టినది. దాని భర్తయగు ప్రభాసుఁడు తక్కిన మాయందఱి సమ్మతిఁబడసి యా ధేనువుంబట్టి తెచ్చెను. మే మందఱ మాధేనువుతోఁగూడ స్వస్థానమున కరిగితిమి. వశిష్ఠమహర్షి తన దివ్యదృష్టిచే నంతయుఁ దెలుసుకొని మమ్మందరను భూలోకమునఁబుట్టు నట్లు శపియించెను.

ఆవార్తవిని మేము వశిష్ఠమహర్షి దర్శించి సాష్టాంగం బర్పించి క్షమింపుమని ప్రాధేయపడితిమి. మాయందు దయ గల్గి తనధేనువు మరల తనకుఁ జిక్కినందుకు మునిసంతసించి

మావలన జరిగిన సంగతినెల్లవిని ప్రభాసునకుఁ బెద్దయు కాలంబు భూలోక నివాసము, తక్కిన మీ యేడుగురకు తత్క్షణము ముక్తియుఁ గలుగునట్లు తన శాపంబును సవరించెను. మేమును మ్రొక్కి యా ముని యానతి నిక్కడకు వచ్చి యమ్మా! నీ శరణు వేడితిమి" అనిరి.

రాజా! ఆ కారణమున నీ యెనిమిదవ వాఁడైన ప్రభాసుఁడు భూమియందుఁ జాలకాలము జీవించును. ఆ యేడుగురు నా కారణంబున తత్క్షణంబె ముక్తిం గనిరి. ఇఁక వీనికి వచ్చిన భయము లేదు. వీఁడు విద్యాభ్యాసంబు సల్పుచు కొన్ని వత్సరములు నావద్దనె యుండును. తరువాత నీ వద్దకుఁ జేరును. అని శంతన మహారాజు నొడంబఱచి దేవవ్రతుఁడను పేరు గల్గిన యాయష్టమవసువును గంగాదేవి తన స్వస్థానమునకుఁ దీసికొని యేఁగెను.

దేవవ్రతుఁడైన యా బాలకుఁడు క్రమముగా పెరిగి పెద్దవాఁడై విలువిద్యయందును మంత్రవిద్యలయందును నేర్పరి యయ్యెను.

ఒకనాఁడు శంతనుఁడు వేటకై పోయి తనకుమారుఁడైన దేవవ్రతునిఁ జూచి యానందపడెను. గంగాదేవియు స్త్రీ వేషమునవచ్చి బాలునకు తండ్రి పరిచయము గల్గించెను. కుమారుఁడు తండ్రికి మ్రొక్కెను. తండ్రికుమారుని దీవించెను.

గంగాదేవి కుమారునకు గొప్పగురువులవద్ద ననేక విద్యలు వచ్చునట్లు చెప్పించెను. పరశురామునివద్ద శస్త్ర విద్యను, వశిష్ఠునివద్ద మంత్రవిద్యను నేర్పించెను.

ఆత్మవిజ్ఞానశాస్త్రమును, తక్కువంగల శాస్త్రములను సనత్కుమారాదుల వలనం గలిగించెను. అట్టి దేవవ్రత కుమారుని గంగాదేవి శంతనునకిచ్చి "ఇతఁడు మీ కులంబునకుఁ బేరు తెచ్చును. వీనివలన మీ కక్షయలోకంబులు కలుగు" నని కుమారునప్పగించి ప్రవాహరూపయై చనెను. శంతనుఁడును దేవవ్రతునిఁ దీసికొనివచ్చి యువరాజ్యపట్టాభిషేకముఁ జేసెను.

దేవవ్రతుఁడు యువరాజై నాల్గువత్సరములు మాత్రము గడచినవి. శంతన మహారాజు వేటకై యొకనాఁడు యమునాతీరంబునకుఁ జనియె. అచట యపూర్వ సువాసనలు వరివాహముఁరీతిఁ జనుదేర నాఘ్రాణించుచు నా వాసనలు వచ్చుదిక్కునకుఁ జని యచ్చట నొక బంగారుబొమ్మయో యన నొప్పుచున్న కన్నెనుజూచెను.

రాజు ఆమెను సమీపించి మించిన యుత్సాహముతో "వనితా! నీవెవరవు? ఇయ్యమునానది నోడ నడపుట నీకేమిపని? నీ తల్లిదండ్రులెవరు?" అని ప్రశ్నించెను.

ఆమెయు నా రాజునుజూచి సంతోషముతో "రాజా! నేను దాశరాజు కూఁతురను, నా జనకాజ్ఞచొప్పున నీ యోడ నడుపుచుంటిని. నా పేరు యోజనగంధి. అదిగో యల్లంత దూరమున మా పల్లెఁ గానఁబడుచున్నది. మీ సంతోషంబును నేను గుర్తించితిని. నేను మీకు నమస్కరించుచుఁ జెప్పుచున్నాను. మా తండ్రియాజ్ఞఁ జొప్పునఁగదా! నే నేపని చేసినను,

మీకోరిక మాతండ్రితోఁ జెప్పెదు. మా తండ్రి జెప్పిన చొప్పరయుటయె నాకు శ్రేయము. మీరు ప్రభువులు. సమస్త ధర్మములను తెలిసినవారు. మాతండ్రి నొప్పించి సంతోషపఱచియె నన్ను స్వీకరింపుడు. మీరు కోపగించినచో మేము ప్రాణములను విడుతుముకానిమీకు ప్రయోజనములేదుకదా!" యనెను.

శంతనుఁడు దాశరాజుకడకుఁజని తన యభిప్రాయంబుఁ దెలిపెను. రాజును గౌరవించి నమస్కరించి దాశరాజు శంతనునితో "రాజా ఆడపిల్ల యెప్పుడో యొకప్పుడు తగిన వరునకీయవలసిన దేగదా, అది యట్లుండ నీవంటివరునకు నా బిడ్డనిచ్చుటలో సందేహమేమున్నది? మేముధన్యులము. కానినా కోరిక యొక్కటి కలదు. మీరు ధర్మముఁ దెలిసినవారు తప్పకనా వాంఛఁదీర్చి నాకూతురను స్వీకరింపుడు" అనెను.

రాజు దాశరాజుతో "నీకోరిక నేనీయఁదగిన దేని నేని నిత్తును. అయినను కోరుము"అనెను. దాశరాజు"రాజా" మీవలన నాసుతయందు పుట్టిన కుమారుఁడు మీరు చూచుచుండఁగనె మీ సర్వరాజ్యాధిపతిఁగాఁగావలెను. ఇదియే కోరిక" అనెను.

శంతనుఁడు తన దేవవ్రత కుమారుని తలఁచుకొని"దాశరాజా! ఇదికాదు. మఱియొకటి వేడుకొనుము"అనెను.

దాశరాజు మఱియొకటియేలయని నిరుత్సాహపడెను. రాజు విచారముతో నేమనఁజాలక యింటికిమరలివచ్చెను. కాని రాజుమనస్సు యోజనగంధియందే యుండుటచేత

మంచము దిగనట్టి మనోవ్యాధితో బాధపడుచుండెను. దేవ
వ్రతుఁడది యెఱిఁగి తండ్రివద్దకుఁజనుదెంచి తండ్రితో "తండ్రీ!
తమరువిచారముతోఁ గ్రుంకునట్లు కనఁబడుచున్నారు. తమచే
రక్షింపఁబడు భూమికి బాధఁగలుగఁజేయఁజాలు శత్రువులా
లేరు. ప్రజలా నిత్యసుఖముతో నున్నారు. సామంతరాజు
లెల్లరు తమకువిధేయులై మెలంగుచుండిరిగదా! మానవాధిపా!
తమ మనః పరితాపము నకుఁ గారణమేమి?" అనెను.

శంతనుఁడు తన మనంబునందు చాలసేపుఁ జింతించి
తుదకుఁ గుమారునితో "పుత్రా! ఏమని చెప్పుదును. ఒకకొడుకుఁ
గొడుకుఁగాడు, ఒకకన్నుఁగన్నుగాదు. ఒక్కకన్నుగలిగినను
గ్రుడ్డివాఁడనెడు పేరెట్లో ఒక కుమారుఁడు కలిగినను సంతతి
లేని వాఁడని యేధర్మశాస్త్రములు చెప్పుచున్నవి.

అదియునుగాక నీ వెప్పుడును యుద్ధములు సల్పుదువు.
నీ వీరత్వమునకు శత్రువులు నిల్వలేకున్నారు. అనఁగూడదు
కాని నీకే యాపదయైన వాటిల్లినచో నే నేమగుదును?
కనుక పలువురఁబుత్రులంబొందుటయే కోరుచున్నాను.
దానికై వివాహవాంఛ గలిగినది. ఆ కోరికయు మొన్న
యమునానది యొడ్డునకు వేటకుంజనినప్పుడు పల్లవించినది"
అనెను.

అనఁగావిని దేవవ్రతుఁడు తండ్రికినమస్కరించి "తండ్రీ!
నీ వాంఛితము తప్పక దీర్చువాఁడ"నని యటనుండిలేచి
మంత్రులతో నాలోచించెను వారు చెప్పఁగా "యమునానది
యొడ్డున దాశరాజ పుత్రిక, యోజనగంధి పేరుగలకన్యక,

జగత్ప్రసిద్ధ కన్యకామణి" కలదనివిని తండ్రికడకేఁగి నమస్క రించి "తండ్రీ! దాశరాజుకడకేఁగి యోజనగంధియను సత్యవతీ దేవిని, మాతల్లినిఁ దోడ్కొని వచ్చెద"ననెను.

తండ్రి కుమారునితో "కుమారా! పిచ్చికపై బ్రహ్మాస్త్రమేల! మనపౌరుషమాటవిక జనులపైప్రయోగించినచో మనల నధర్మవర్తనులని లోకులు నిందింతురు" అనెను.

దేవవ్రతుఁడు తండ్రితో "తండ్రీ! నేనంతటి యవివేకిని గాను వానిని సంతోష పరచియె మాతల్లి సత్యవతిని తీసుకొనివచ్చెద" అనెను.

దేవవ్రతుఁడు మంత్రి సామంతులు వెంటరాగ దాశ రాజుంజేరి "మా తండ్రికి నీ పుత్రికయగు సత్యవతీదేవిని భార్యగా" నిమ్మని కోరెను.

దాశరాజు గంగాపుత్రుని, వచ్చిన వారినందరిని, యథోచితముగా గౌరవించి నమస్కరించుచు నిట్లనెను.

"కుమారా! నీవన్ని ధర్మములెఱిఁగిన వాడవు. మంచి చెడ్డలు విచారించునట్టి బుద్ధిమంతుఁడవు. పితృభక్తి పరాయణుఁడవు. నీ తండ్రికై నాతినయ నడుగవచ్చిన వాఁడవు. ఉపరిచరుఁడను రాజర్షి వచ్చి "యీ సత్యవతిని శంతనునకే యిమ్ము. ఇతరులకీయవలదు" అనిచెప్పెను. కనుకనే దేవలుండనువాఁడు కన్యార్థంబు వేడినను నా యీమాటలు విని తిరిగిపోయెను.

కుమారా! మీ వంశముతోడ సంబంధము నాకు సంతోషముకదా? అయినను నాకోరికదీర్చి మీ తల్లిని సత్యవతిని గొనిపొమ్ము" అనెను.

"దాశరాజా! నీవేమి కోరుకొందువో తెలుపుము. ధర్మబద్ధమయినంతవరకు నాకు సందేహములేదు." అను దేవవ్రతుని మాటలువిని దాశరాజు తనవాంఛను తెలియఁబరచెను.

దేవవ్రతుఁడు సామంతరాజులు మంత్రులును మిగిలిన వారందరును వినునట్లు "ఈ సత్యవతీదేవియందు పుట్టినవాఁడే మాకెల్లరకురాజై భారతదేశమును పరిపాలించును" అని ప్రతిజ్ఞ చేసెను.

మంత్రులును, సామంతులును "దాశరాజా! నీ కోరిక నెఱవేరినదికదా! ఇఁక సత్యవతీదేవిని పంపుము" అనిరి.

దాశరాజు "ఇఁకసంతోషముకాక యేమున్నది? నా కోరిక నెఱవేరక యెట్లుండును? కాని యింకొక సంగతి. దేవవ్రతుఁడు రాజ్యత్యాగముః చేసినను వారిసంతతి అందుకు అంగీకరించునా?" అనెను.

సామంతరాజులు మంత్రులును "దాశరాజా! నీవు మాట్లాడినది ధర్మబద్ధముకాదు. ముందెప్పుడో జరుగనున్న విషయమునుగూర్చి యిప్పుడెవరేమి చెప్పఁగలరు?" అనిరి. దాశరాజు "దానినిగూర్చి దేవవ్రతుఁడే చెప్పవలెను. మఱి యెవ్వరును చెప్పఁజాలరు" అనెను.

మంత్రులు "దాశరాజా! భవిష్యత్తునుగూర్చి చెప్పినను ప్రయోజనముండునా?" అనిరి. సామంతరాజులు "దాశ

రాజా! ఇచ్చువారున్నారుకదాయని యడుగుటకు న్యాయ
ముగా నుండవలదా?"యనిరి.

దేవవ్రతుఁడు "చాలు వాదోపవాదములేల? వినుఁడు
నా ప్రతిజ్ఞ. నేను బ్రతికియున్నంతకాలము బ్రహ్మచర్య వ్రత
మును బూనియుందును. నా పల్కులకు భూమి, సూర్యుఁడు,
దేవతలు సాక్షులు. నా తండ్రిసౌఖ్యమునుగోరి నా ప్రాణము
లను సైతము విడువఁగల నాకు రాజ్యత్యాగము, గృహస్థ
ధర్మ త్యాగము ఒక లెక్కలోనివి కావు. నాదృఢబ్రహ్మచర్య
వ్రతముననే యుత్తమ లోకములు నాకుఁగల్గుఁగావుత" అని
మరల ప్రతిజ్ఞ జేసెను.

ఆకసంబునుండి చూచుచున్న దేవతలు పుష్పవృష్టిచే
దేవవ్రతుని గౌరవించిరి. "దేవవ్రత కుమారా! నీ విట్లు దృఢ
మనస్కుండవై ప్రతిజ్ఞ జేసితివి. కావుననిప్పటినుండి నీవు భీష్ముఁ
డనెడినామంబునఁ బ్రఖ్యాతుఁడవై విరాజిల్లుము "అనిరి. కడమ
వారంఅు నాశ్చర్యమందిరి. దాశరాజు సంతోషముతో
భీష్మునిఁగౌఁగిలించుకొని ఇప్పటికి నాకోరిక తీరినది. కుమారా!
ఇఁక మీ తల్లిని బ్రయాణముఁ జేయించుచున్నాను. తీసుకొని
పొమ్ము" అని వారికులమర్యాదల చొప్పున సత్యవతిం గౌర
వించి యలంకరించి హస్తిపురంబునకుఁ జేర్చెను.

శంతనుఁడు సత్యవతిం బెండ్లాడి తనకుమారుని త్యాగంబు
నకు సంతసించి యాతనికి స్వచ్ఛందమరణంబుగా వరంబిచ్చెను
ఆ వరమాహాత్మ్యమున భీష్ముఁడు చాలకాలము జీవించెను.
భారత యుద్ధంబునందును సాటిలేని పరాక్రమము గలవాడై

పదిరోజులు ఘోరయుద్ధంబుఁ జేసి పాండవులయందు ప్రీతిఁగల వాఁడగుటచే యుద్ధంబుమాను తలంపుఁగలవాఁడై యస్త్ర సన్యాసంబుఁ జేసెను.

భీష్ముఁడు కురుక్షేత్రమునందు బాణశయ్యముపైఁ బరుండి తండ్రివరంబున యమునిఁదరిఁ జేరనీయక భారత ఘోర రణంబు పూర్తియగువరకు బ్రతికియుండెను. ధర్మరాజునకు ధర్మంబులను బోధించెను.

తుదకు మహాత్ముఁడును, మహా త్యాగియును, మహా వీరుఁడును, మహాబ్రహ్మచార్యానుష్ఠానుండునగు భీష్ముఁడు శ్రేష్ఠమయిన యుత్తరాయణంబు ప్రవేశించినతోడనే యుత్తమంబైన యేకాదశియందు భౌతికదేహంబును విడిచినసురలం గలసెను.

బాలకులారా! మీరును భీష్మునివలె త్యాగమూర్తులని పేరందుఁడు. తల్లిదండ్రులయందు భక్తిప్రేమను జూపుఁడు. దేశభక్తులని పేరుగాంచుఁడు. తక్కువజాతివారివలన మీరొక వస్తువును తీసుకొనదలఁచినచో వారిని సంతోషపరచియే తీసికొనుడు. బీదల నాదరించుట, వారి జీవనోపాధికి పాటుబడుటయు, దేశీయ వస్తువుల నుత్పత్తిచేయించి వానినే యుపయోగించుటయు దేశభక్తులకు ముఖ్యకర్తవ్యము. ప్రజలకు గావలసిన సౌకర్యములు సమకూర్చు దేశీయనాయకుని ప్రజలు ప్రేమతో గౌరవింతురు. భీష్మునివంటి యాదర్శనాయకుని చరిత్రమును మఱచిపోఁగూడదు.

# 4. శ్రీ రాముడు

ఆ. వె. ప్రజలు కోరుకొనిరి రాముడే రాజని
రాముడెంచె ప్రజల ప్రాణములుగ
ప్రజలు మెచ్చునట్టి పనిచేయు నొల్లని
రాముఁనంటి ప్రజల ప్రభువు వలయు.

బాలకులారా! రామరాజ్యమను ప్రసిద్ధిని వినియున్నారు కదా! ప్రజలకష్టములను తొలగించుటకు భగవంతుడు మహాత్ముడుగ నవతరించుట యందఱికిఁ దెలిసిన విషయమే. ప్రజా ప్రభుత్వము నేడు క్రొత్తగా వెలసినదిగాదు పూర్వమే శ్రీరాముడు ప్రజల యిష్టానుసారము నడచి తొలుత తన రాజ్యమును త్యాగము చేసెను. తరువాత తన భార్యయగు సీతాదేవినిఁ గూడ త్యాగముఁ జేసిన మహానుభావుఁడు మహా త్యాగి. అట్టి శ్రీ రాముని చరిత్రమును సంగ్రహముగా వినుఁడు.

అయోధ్యయను పురమును ముఖ్యపట్టణముగాఁ జేసికొని, కోసల దేశములను పాలించు ప్రభువులలో దశరథమహారాజు ప్రసిద్ధిఁ జెందెను. ఆయనకు ముగ్గురుభార్యలు. కౌసల్య పెద్ద భార్య. సుమిత్ర రెండవభార్య. కైక మూడవభార్య. పెద్ద భార్యయందు శ్రీ రాముఁడుజనించెను. రెండవభార్యయందు లక్ష్మణుఁడు, శత్రుఘ్నుఁడు, మూడవభార్యయందు భరతుఁడు పుట్టెను.

ఈ నల్వురు వశిష్ఠ మహర్షి కడ విద్యాభ్యాసము జేయఁ బూనిరి. అక్షరాభ్యాసమయినది మొదలు కొలఁది దినములకే యీనల్వురు బాలకులు చదువుట, వ్రాయుట నేర్చుకొనిరి. మఱియు వారు బాణములు ప్రయోగించుటయందును, కత్తి త్రిప్పుటయందును, గుఱ్ఱపుస్వారీ చేయుటయందును మిగుల నేర్పరులయిరి.

ఆ బాలకుల బుద్ధిశక్తియు, జ్ఞాపకశక్తియు, గ్రహణ శక్తియు నద్భుతములు. ఒక్కసారి చెప్పఁగనే వారెట్టి విషయమునైనను గ్రహింపఁగలరు. ఒక్కసారి చదువఁగనే కఠిన పాఠమునుగూడ నర్థంబు జేసికొనఁజాలినవారైరి. వారిసాటి లేని బుద్ధికబ్బురపడని వాఁడుండఁడు. ఇంతయేల! వారికిఁ బదేండ్లైనను నిండకముందే క్షత్రియోచిత విద్యలెల్ల కరతలామలకములయినవి.

మహారాజొక శుభలగ్నంబున వారికుపనయనముఁ గావించెను. వెంటనే వారికి గురువు వేదములను నేర్పెను. అస్త్రములను ప్రయోగించు మంత్రములను వారు నేర్చిరి.

బాలకులయందు దీనరక్షణము, పరస్త్రీ పరాఙ్ముఖత ప్రజల హితవెఱిఁగి నడచుట, ప్రజల యిష్టముఁగోరి తనసర్వస్వమును త్యాగముఁజేయుట మున్నగు మహాపురుష లక్షణములు ప్రకాశించినవి.

వారి పూర్వజన్మము ననుసరించి రామ లక్ష్మణులొక జంట. భరత శత్రుఘ్నులొకజంట యయిరి. భరత శత్రు

ఘ్నులు కేకయరాజగృహమున నుండెను విద్యాభ్యాస మొనరించుచుండిరి.

రామ లక్ష్మణులు జంట బాయక యయోధ్యావాసులకుఁగనుల పండువుఁ జేయసాఁగిరి. పిల్లలు క్రమముగాఁ బెరిగి పెద్దవారైరి.

ఒకనాఁడు విశ్వామిత్రుఁడు దశరథుని చూడవచ్చెను. దశరథుఁడు మునిని గౌరవించి "వచ్చినపని తప్పక పూర్తి జేయుదు"నని వాగ్దానముఁ జేసెను. ముని సంతోషముతో— "రాజా! నేను యాగము మొదలుపెట్టినప్పుడు రాక్షసు లెచ్చటనుండియో వచ్చి నా యాగము బాడుచేయఁ బూనుచున్నారు. ప్రజలబాధలు పరిభవములతోఁ జెప్పుకొనుటకు వచ్చితిని. శ్రీరాముని నావెంట బంపుము నావెంట వచ్చిన శ్రీరామునివలన నా యాగము నిర్విఘ్నముగా సాఁగును. శ్రీరామునిచూచి యా రాక్షసులు పాఱిపోవుదురు" అనెను.

దశరథుఁడు విశ్వామిత్రునితో "మునీంద్రా! శ్రీరాముఁడు రాక్షసులవలన భయపడును. వాఁడుపసివాఁడు. నేనువచ్చి యా రాక్షసులను సంహరించి మీ యాగమును కాపాడెదను" అని వినయముగాఁబల్కెను.

విశ్వామిత్రుడందుల కాగ్రహమంది రాజుతో "రాజా! నాకునీవేల? శ్రీరాముఁడే కావలెను. "ఏపనియైన చేయుదు" నంటివిగదా! శ్రీరాముని నావెంటఁ బంపుము నీ మాట

నిలుపు కొనుము. సత్యమును విడువకుము. నీ గురువుగారి నాలోచింపుము. శ్రీరాముని పంపితి వేని శ్రీరామునకును నీకును శుభముఁ జేకూరును" అనెను.

వసిష్ఠ మహర్షిని పిలిపించి రాజు చాలసేపు సంప్రదించెను. ఆ మహర్షియు, "శ్రీరాముఁడు సామాన్యుఁడు కాఁడు. శ్రీహరియనియే యెంచు"మనియు "వానికాపదరాదుక దా సర్వశుభములు చేకూరును. తప్పక విశ్వామిత్రుని వెంటఁ బంపు"మనియు ధైర్యముఁ జేకూర్చెను.

శ్రీరామ లక్ష్మణులు జంటబాయనివారగుటనుక, తల్లి దండ్రులకు, గురువుగారికిని మ్రొక్కి విశ్వామిత్రుని వెంట ప్రయాణమైరి.

పిల్లలకు పిట్టకథలనిన సంబరము. చిన్ని చిన్ని కథలను చెప్పుచు ముని యా బాలురను వెంటనడిపించి తీసికొని పోఁగెను. కథల ధోరణిలోఁబడి పిల్లలు నడక శ్రమయనుట లేదు. కథపూర్తియగునో లేదో "తాతా! మఱియొకకథ చెప్పు" అని ముద్దుముద్దుగా నడుగసాఁగిరి. ఆ ముద్దుమాటలకు మురియుచు ముని చక్కని నీతికథలను జెప్పసాఁగెను.

ఆకలిదప్పుల శ్రమ నివారించుటకు పిల్లలకు ముని గొప్పమంత్ర ముపదేశించెను. ఆ మంత్రము వారికి భవిష్యత్తులో దండకారణ్యమున చాలవఱకుపయోగపడెను.

ముని పిల్లలకు జృంభకాస్త్రముల మంత్రముల నుపదేశించెను. ఈ మంత్రము లితరమునులకు రావు ఇంతయేల! వసిష్ఠునకును రావనియే చెప్పవచ్చును.

బాలకులు గురువుగారియందు విధేయతతో మెలఁగినచో వారికి గురువు చెప్పరాని రహస్యముండదు కదా!

విశ్వామిత్రుఁడు యాగము నారంభించెను. రామ లక్ష్మణులు రక్షకులై కలచియుండిరి. యాగధూమము లాకాశమున కెగసినవి. రాక్షసులు వారి మామూలు ప్రకారము యాగమును బాడుచేయ వచ్చుచున్నారు. శ్రీరాముని బాణములువారికెదు రేఁగినవి. కొందరు రాక్షసులుచచ్చిరి. కొందరు పాఱిపోయిరి. యాగము నిర్విఘ్నముగాఁ గొనసాఁగినది విశ్వామిత్రుఁడు సంతోషించెను.

తనయాగమును రక్షించుటకును, రాక్షసులను శిక్షించుటకు చేసిన ప్రయత్నము సఫలమయినందుకు విశ్వామిత్రుఁడు చాల సంతోషించెను.

“తనకుపకారముఁ జేసిన శ్రీరామునకుఁ ప్రత్యుపకారమేమి చేయవలెనా!” యనునాలోచనలో ముని మునిఁగి పోయెను.

యాగమునకొచ్చిన వివిధ దేశ మునులను సమావేశపఱచి విశ్వామిత్రుఁడు శ్రీరామునకుఁ ప్రత్యుపకారముఁ జేయు తలంపులో దీర్ఘాలోచనముఁ జేసెను.

కొందరుమునులు విశ్వామిత్రునితో “రాముఁడు క్షత్రియుఁడు దుష్టశిక్షణమువారివిధి. ఇంతమాత్రమునకేమి ప్రత్యుపకారము చేయవలెను!” అనిరి.

కొందఱు "వీరికి మన మునులకన్నులనిచ్చి వివాహముఁ జేయుదమ"నిరి. కొందరు "వీరికి మనము విద్యలను నేర్పుద" మనిరి.

కొందరు "మిథిలాపురమున జనకరాజునకు చక్కని కూఁతురుకలదు. ఆమె పేరుసీత ఆమెను శ్రీరామునకు నీడు జోడు గాగుగానున్నది. మనము జనకునంగీకరింపఁజేసి వీరిద్దఱికి వివాహముఁ జేయించుట మంచిదనిరి.

విశ్వామిత్రుఁడా సీతనుగురించి దివ్యదృష్టితోఁ గని చెప్పెను "ఆమె తప్పక శ్రీరాము సతియగు"నని వెంటనే మునులకుఁ దెలియపరచెను అందఱును సీతాకళ్యాణమునకుఁ బ్రయాణమైరి.

విశ్వామిత్రుఁడు మిథిలాపురోపవనమున కాలకృత్యములు తీర్చికొని కొందరి మునులద్వారా జనకమహారాజునకు తన వార్తఁ దెలియఁజేసెను.

వెంటనే జనకమహారాజు మంత్రులతోవచ్చి, మునులను రామలక్ష్మణులనుచూచి యానందించి, వారినందరిని తన భవనంబులకుఁ దోడ్కొని యేఁగెను.

జనక మహారాజు "నావద్ద శివధనుస్సుకలదు. దాని నెత్తి యెక్కుఁబెట్టినట్టి వానికే నాకూతురయిన సీతనిచ్చెద" నని ప్రతిజ్ఞఁ జేసిన వృత్తాంతముఁ దెలియ జేసెను. విశ్వామిత్రునాజ్ఞచేత శ్రీరాముఁడా శివధనస్సునెక్కుఁ బెట్టఁబోవఁగ

నది పెళ్ళుమని విరిగిపడెను. మునులానందపడిరి. జనకుఁడు చాల సంతోషించెను. సీతవచ్చి పూమాలికచే శ్రీరాముని వరించినది.

సీతారాముల కళ్యాణ లగ్నము నిర్ణయింపఁబడినది. దశరథమహారాజునకుఁ దెలియఁజేసిరి. దశరథమహారాజు పుత్రమిత్ర కళత్రపరివారములతో మిథిలకు చేరుకొని మునిపాదములకు మ్రొక్కెను. వసిష్ఠ విశ్వామిత్రులు స్నేహమునఁ బ్రేమమునఁ గౌఁగిలించుకొనిరి.

సీతారాముల వివాహముతోఁబాటు మిగిలిన పుత్రులకును, వివాహము వైభవముగా జరిగినది. ఊర్మిళలక్ష్మణుని భార్య. మాళవి భరతునిభార్య. శ్రుతకీర్తి శత్రుఘ్నునిభార్య.

వివాహ మహోత్సవమునఁ బుష్పవృష్టి గురిసెను. మునులు దీవించిరి. ప్రజలు సంతసించిరి. అందరితోడను దశరథ మహారాజ యోధ్యకుఁ జేరెను. వేడ్కలెన్నొఁటినో చేయించెను.

రాజు చేసిన విందులకు ప్రజలు మిక్కిలిఁ దృప్తిం జెందిరి. ప్రజాదరము, మంచిం గోరు ప్రభువు ప్రజలను తృప్తిపరపనిచో నా ప్రజలా ప్రభువును గౌరవింపరు. మనసారఁ బ్రేమింపరు కదా!

ఇట్లు వినోదములతో కొలఁది రోజులుమాత్రము గడచినవి. పూర్వమునలె కేకయరాజు కోరఁగా భరతుఁడు తండ్రియొద్ద సెలవు బుచ్చుకొని తమ్ముఁడగు శత్రుఘ్నునితో గూడి మాతామహుల యింటివద్దనె యుండెను

దశరథమహారాజు రాముని యువరాజుఁ జేయనెంచి వసిష్ఠమహర్షితో నాలోచించెను. మంచి ముహూర్తము నిశ్చయింపబడినది. ప్రజల యామోదముకూడ స్వీకరింపఁబడినది.

తెల్లవారిన శ్రీరాముఁడు సూర్యోదయపువేళ యువరాజుగాఁ బట్టాభిషిక్తుఁడగునని యందరికిఁ దెలిసినది. ఆరాత్రి ప్రజలెల్లను పురమలంకరింపసాఁగిరి. అంతఃపురములో సీతను, మందిరమున శ్రీరాముని మంగళ స్నాతులంజేసిరి. మంగళ వాద్యంబులు మ్రోగినవి. వసిష్ఠుఁడు శ్రీరాముని చేతికిఁ గంకణముఁగట్టెను. రాజు కైకమందిరమునుండి తిరిగిరాలేదు. మంత్రిచే వసిష్ఠుఁడు వర్తమానముఁ బంపెను. మంత్రి తిరిగి వచ్చి శ్రీరామునితో "మీతండ్రిగారు కైకమందిరమునఁగలరు మిమ్ములను రమ్మనినట్లు కైకమ్మగారు ద్వారముకడనిలచి చెప్పుచున్నారు" అనెను. వసిష్ఠుఁడు "రాజేమి చేయుచున్నాఁడు." అనెను. మంత్రి "నన్నులోనికి వెళ్ళనిచ్చినఁగదా నాకావిషయము తెలియుట!" అనెను.

శ్రీరాముఁడు వెళ్ళి కైకమ్మ నడిగెను. "మాతండ్రి యెచ్చట! ఏమి చేయుచున్నా"రని. కైకమ్మ మీతండ్రిగారుమూర్ఛపోయిరి.

శ్రీరాముఁడు అమ్మా! మూర్ఛపోవుటకుఁగారణమేమి?

కైకమ్మ:-మూర్ఛపోవుటకుఁ గారణమునీవే.

శ్రీరాముఁడు:- నేనెట్టి కారణమో తెలుపఁగోరుచున్నానుతల్లీ.

కైకమ్మ:- నీవు నీ తండ్రిమాటవిందువా? నీ తండ్రిమాట నీవు శిరసావహింపవని నీ తండ్రి నీతోఁజెప్పలేకమూర్ఛిల్లెను. "వినెద" నంటివా తెల్పుదును.

శ్రీరాముఁడు:- తల్లీ! తప్పక నాతండ్రిమాట చెల్లింతును. అమ్మా నాయందు దయయుంచి చెప్పుము.

కైకమ్మ:- మీ వంశమాడితప్పఁది సుమా!

శ్రీరాముఁడు:- తల్లీ! ఆమాట నేనెఱుఁగుదును. తల్లి దండ్రుల మాట చెల్లింపని కుమారుఁడు మావంశమున లేడమ్మా

కైకమ్మ:- రామా! విను నేను చెప్పఁబోవు మాటలు మీ తండ్రి హృదయములోనివే సుమా! నీయందు ప్రేమ చేత నీతో స్వయముగాఁ జెప్పఁజాలక పడిపోయినాఁడు

శ్రీరాముఁడు:- అమ్మా! మాతండ్రి హృదయమును నాకు తెల్పుము. నేను తప్పక శిరసావహించి చేయుదును.

కైకమ్మ:- రామా! నీవు ధైర్యముగా వినుము. ఇప్పుడు చెప్పఁబోవుమాటలు చాలకఠోరముగా నుండునుసుమా! నీవు మాత్రము ఆమాటలువిని ధైర్యముతో నిలువఁగలవా? మూర్ఛపోవుకదా!

శ్రీరాముఁడు:- అమ్మా ఏమైనను మీరుచెప్పిన వనితప్పక చేయుదునంటినికదా!

కైకమ్మ:- రామా! ఇవి నామాటలుకావు. నీ తండ్రిమాటలని నమ్ముదువా?

శ్రీరాముఁడు:- అమ్మా! నీవుమాత్రము తల్లివికావా? నీవు చెప్పినను శిరసావహించి చేయుదును.

కైకమ్మ:- రామా! నీవెంత మంచివాఁడవు! తల్లి వేఱు. తండ్రి వేఱు అగునా? నా మాటయయినను తప్పక శిరసావహించి యాచరింతువుకదా!

శ్రీరాముఁడు:- ఆజ్ఞతప్పుట మా వంశమున నే లేదుగదా! నీ మాట మాత్రము మేముతిరస్కరించి నడువఁగలమా? తప్పక చెప్పుముతల్లీ!

కైకమ్మ:- అట్లయిన వినుము నీవు తెల్లవారక మునుపు దండకారణ్యముఁ జేరుము. అచ్చట నీవు పదునాల్గు సంవత్సరములు నివసింపవలెను. ఇప్పుడు యువరాజు భరతుఁడు కావలెను. మున్నొకపరి యుద్ధములో మీ తండ్రికి సహాయముఁ జేసితిని. అప్పుడు మీ తండ్రినాకు రెండువరములిచ్చెను. ఆ వరములిప్పుడీ రీతిగఁ గోరుకొంటిని. ఏమి యాలోచింప సాఁగితివి?

శ్రీరాముఁడు:- ఈ స్వల్పభాగ్యమునకీపాటి పెద్దయుపన్యాస మెందుకు తల్లీ! తల్లిదండ్రుల యిష్టానుసారము నేను ప్రాణ త్యాగమునకైన వెనుదీయను గదా? ఇఁక రాజ్యత్యాగంబునకు సమ్మతింపకుందునా?

అని శ్రీరాముఁడు కైకకును, పడియున్న దశరథమహారాజునకు సాష్టాంగమర్పించి యంతఃపురములోని

కేఁగెను. అప్పుట లక్ష్మణుఁడు "అన్నా యువరాజ్య పట్టాభిషేకమున కప్పుడే కంకణముఁగూడఁ గట్టుకొంటివా!" యనెను.

శ్రీరాముఁడు:- "తమ్ముఁడా! కంకణము కట్టుకొనుట దండకారణ్యమును పరిపాలించుటకుసుమా"!యనెను. రామలక్ష్మణుల సంభాషణములో నన్ని విషయములు తెలిసికొనఁబడినవి.

లక్ష్మణుఁడు:- అన్నా! నేను మీ వెంటవచ్చెదను.

శ్రీరాముఁడు:- తమ్ముఁడా! నీ కెందుకీ శ్రమ? నేనుత్వరగ మరలి వచ్చెదను విచారింపకుము.

లక్ష్మణుఁడు:- మనజంట యరణ్యమునందును బాయకూడదని నా యుద్దేశము.

శ్రీరాముఁడు:- తమ్ముఁడా! నీవు నీయన్నమాట తిరస్కరించి యెప్పుడైన నుంటివా? ఆగుము.

లక్ష్మణుఁడు:- అన్నా! నీ మాటశిరసావహించి నేనయోధ్యలో నుందునా! నీవు మరలివచ్చి నన్నుఁజూడవు. ఇంతయేల? నేనిప్పుడే... ...

శ్రీరాముఁడు:- లక్ష్మణునిఁ గౌఁగిలించుకొని నీకంత వంతయెందుకు రారమ్ము. నేను సీతతోఁ జెప్పివత్తును. నీవు మీ యమ్మగారితోఁ జెప్పిరమ్ము.

సీత పూవులు మాలఁగాఁగట్టుచు నల్లంత దూరములో వచ్చెడు రాముని గని లేచివచ్చి "యువరాజుగారికి పూవుల

మాలలు తయారగుచున్న"వనెను. శ్రీరాముఁడు చిరునవ్వుతోఁ
దన వృత్తాంతముఁజెప్పెను. సీతదుఃఖించుచు "నాథా నేనును
మీ వెంటవత్తు"ననెను.

శ్రీరాముఁడు సీతతో నరణ్యమునఁగల కష్టములనెల్లఁ
జెప్పి "యచ్చట రాక్షసులు నిన్నుఁజాల బాధింతు"రనెను.
సీత రామునితో "నీవు సమర్థుఁడవని నాతండ్రి నీ కిచ్చెను.
నన్ను రాక్షసులవలన నన్నొక్కదానిని రక్షింపలేకపోయి
నచో నీవు భూమండలములోని ప్రజల నందఱినెట్లు రక్షింపఁ
గలవు? నిన్ను సమర్థునిఁగాఁదలఁపనా? అసమర్థునిగాఁ దలఁపనా?"
అనెను. అంతటితో శ్రీరాముఁడేమనలేకపోయెను. "సరే
రార"మ్మనెను.

దుఃఖించుచున్న కౌసల్యకు, సుమిత్రకు, నమస్కరించి
యాశీర్వచనముపొంది, సీతారామలక్ష్మణులు పడియున్న
దశరథుని పాదములకు మ్రొక్కి కైకకును మ్రొక్కి దండకార
ణ్యము జేరిరి.

శ్రీరాముని దండకారణ్య నివాసమువిని భరతుఁడును
మిగుల దుఃఖించి శ్రీరాముని తీసికొనిపోయి యయోధ్యలో
రాజ్యాభిషేకముఁ జేయుటకు బహుప్రయత్నములుసల్పి,
తుదకు శ్రీరామునియాజ్ఞ మీరలేక జటావల్కలధారియై
రామపాదుకలను నందిగ్రామమునసిల్పి మంత్రులపై రాజ్య
భారమునుంచి తాను వైరాగ్యము గలవాఁడైయుండెను.

శ్రీరాముఁడు దండకారణ్యములోని రాక్షసులనెల్లఁ
జావమోదెను. కావఁగామిగిలిన రాక్షసులు కొందఱు

శ్రీరామునిమీఁది పగ దీర్చుకొనుటకు లంకాధిపతియగు రావణునితోఁ జెప్పిరి. మహారాజ్య వైభవములోనున్న రావణుఁడు వారిమాట పట్టించుకొనలేదు.

తుదకు రావణుని చెల్లెలు రామలక్ష్మణుల వలనఁ బరిభవింపఁబడి రావణునకు జెప్పి అతనికి సినమెత్తించినది రావణుఁడు సీతాదేవి నొంటరిపాటునఁ జూచి తనలంకకుఁ జేర్చెను. సీతావార్త దెలియక శ్రీరామలక్ష్మణులు దుఃఖించుచు నడవులను వెదకిరి. వానరులతో మైత్రిఁ జేసికొని వానరులు శ్రీరామునకు సహాయము జేయుదుమనిరి. మాటయిచ్చిరి. వానరరాజగు సుగ్రీవుఁడు శ్రీరామునకు ముఖ్యస్నేహితుఁడై దుర్మార్గుఁడు, అన్నయునగు వాలిని శ్రీరామునిచే చంపించెను. సుగ్రీవుఁడు వానర రాజ్యమునఁ బట్టాభిషిక్తుఁడయ్యెను. సుగ్రీవునానతినన్ని దిక్కులను వానరులు సీతకై యన్వేషించిరి.

హనుమదాదులు దక్షిణ దిక్కునందు సముద్రమువరకుఁ బోయిరి. సీత లంకలోనున్నవార్త వారికిఁ దెలిసినది. వారెవ్వరు సముద్రముదాటి పోఁజాలరైరి. తుదకెట్లో హనుమంతుఁడు లంకలో ప్రవేశింపఁగలిగెను. వెదకి వెదకి సీతానివాసముఁ గనిపట్టెను.

హనుమంతుఁడు సీతతో "శ్రీరామదూత" ననియు "రాముఁడు తప్పక రావణుని జయించి నిన్నుఁదీసికొనిపోవు" ననియు "ఈ రాక్షసులు తనబలముముందు దోమలువంటి వా"రనియుఁ జెప్పి ధైర్యముఁ గలుగఁజేసెను.

సీత హనుమంతునివలన శ్రీరాముని ముద్రికనుజూచి యానందించి తన శిరోరత్నమును హనుమంతునకిచ్చెను. హనుమంతు నాశీర్వదించెను. హనుమంతుఁడశోకవన భంజనముఁజేసెను. అడ్డము వచ్చిన రాక్షసవీరుల జంపెను. ఇంద్రజిత్తుచే బట్టుబడి హనుమంతుఁడు రావణుదర్బారునకుఁగొంపోఁ బడెను.

హనుమంతుఁడు రావణు గొప్పతనమున కాశ్చర్యపడి, వాని ప్రక్కనే నీతివాక్యములు వినిపించుచున్న విభీషణుఁ జూచెను. తానును రావణునినంటి వానికిమంచి మార్గములోఁ బెట్టుటయె మంచిదని యెంచెను.

శ్రీరాముని పొగడుచుండెను. పౌరుషవంతుఁడు స్త్రీల నపహరించుట ధర్మము కాదని బోధించెను. రావణునకు మంచితనము నుపదేశింపఁబూనెను. కాని రావణునకుఁ గోపము వచ్చెను. చెడ్డవానికి మంచి చెప్పినను కోపమువచ్చును.

రావణుఁడు తనభటులతో "హనుమంతుని తోఁకకు నూనెగుడ్డ చుట్టి నిప్పుముట్టింపుడు. దానితో వాఁడు తోఁక కాలి క్రమముగా బలవన్మరణముఁబొందు" ననెను.

హనుమంతుఁడు రక్షక భటులనుకొట్టి కట్టులను త్రెంపుకొని లంకాపురినెల్లఁ దనవాలాగ్నితోఁ గాల్చిపోయెను.

ప్రభువు దుర్నీతి పరుఁడయినచో నరులు వానరులగుదురుకదా! తన్ను నమ్మిన నాయకునకు ఏ ప్రభుత్వము కష్టము కల్గించినదో యా ప్రభుత్వమునకుఁ గష్టము నష్టము మంచివాఁడు సైతమాచరించునుకదా!

హనుమంతుఁడు తనతోడి వారలతోవచ్చి శ్రీరామునకు సీతక్షేమ వార్తఁ దెల్పెను. వానరసైన్యంబుల సహాయమున సముద్రముపై శ్రీరాముఁడు కొండలుబెందువలెఁ తేలెఁడు వంతెనఁగట్టెను.

విభీషణుఁడు తనయన్న దుర్మార్గమును సహింపనేరక శ్రీరాముని శరణుఁజొచ్చెను. వానరవీరులు శ్రీరామునితో "రాక్షసమాయలు నమ్మరాదు. శత్రుపక్షమునందలి వారిని మనలోఁజేర్చుకొనరాదు" అనిరి.

హనుమంతుఁడు శ్రీరామునితో "రామా! ఇతఁడు విభీషణుఁడు. నేను వానిమంచితనమును లంకలోస్వయముగాఁ జూచితిని. వాఁడువాని యన్నకునీతిని బోధించుచుండ నేనుఁ జూచితిని. వీనిని మనలోఁ జేర్చుకున్నమాత్రమున మనకు హానిలేదు. మఱియు లాభము కలుగును." అనెను.

విభీషణుఁడు శ్రీరాముని పాదములమీఁద వ్రాలెను. శరణాగత రక్షణమే బిరుదుగఁగల శ్రీరాముఁడు హనుమంతుని మాటమాత్రము నమ్మెను.

కొండలవంతెన మీఁదుగ దాటి వానరసైన్యము లక్షలాదిగఁబోయి లంకలో రావణుని కోటను నాల్గుమూలల ముట్టడించెను.

శ్రీరాముఁడా సమయమున రావణునకు బుద్ధిఁజెప్పింప యత్నించి యంగదునిచే రావణునకు రాయబార మంపెను. అంగద రాయబారముకూడ వ్యర్థమయ్యెను.

కొండలు బెండువలెఁదేలెఁడు కాలవైపరీత్యమును దూతలవలనవినియు రావణుఁడు ధైర్యముతోఁ దనసేనలను కదనభూమికిఁ గదలించెను.

దురాత్ములైన రాక్షసులను చంపుటకు వానరులు ధైర్యోత్సాహములు గలవారైనిలచిరి. "వానరులోకవీరలా"! యను క్షుద్రబుద్ధితో రాక్షసులు వానరులతో యుద్ధము జేయ సన్నద్ధులయిరి. పోరుఘోరముగా సాఁగెను.

రాక్షసులు నియంతయగు రావణుపక్షమువారు"యథా రాజా తథా ప్రజా"యనురీతిని రావణువలెనే రాక్షస ప్రజలును దుర్మార్గులు.

వానరులు సర్వస్వము త్యాగముఁజేసిన శ్రీరాముని పక్షమువారు, ధర్మసంరక్షణము జేయఁబోవువారు. ఉత్తముఁడగు శ్రీరాముని నాయకత్వమున మెలఁగి మంచిగుణములు గలవారైరి.

వానరులు సాధువులయినను, రాక్షసుల బలమునకు తగ్గిపోవువారుకారు రాక్షసులు కొండలను విసరి వానరుల మీఁద బడవైచిరి. వానరులును కొండలనెత్తియే విసరివేయ సాఁగిరి.

రాక్షసులు వానరులు కొండలతోఁ జెండుకొనిరి. చెట్లుపెఱికి చావమోదుకొనిరి. చాలమంది రాక్షసులు హతులయిరి. వానరులును వేనవేలు మృతినొందిరి.

ధనుర్విద్యయందు నేర్పుగలవారును, ఆయుధములు ధరించినవారును వీరులని పేరుపొందినవారును చాలవఱకు రెండుపక్షముల యందును మృతినందిరి.

రావణు పుత్రులెల్లరు మరణించిరి. రావణుఁడు శ్రీరాముని భుజబలమునకుఁ దాళలేక రణరంగమునుండి రెండుమారులు పాఱిపోయెను.

రావణు నిరంకుశ పరిపాలనమున మూలమూలలనుండి సైనికులును బలవంతముగా యుద్ధమున నిలబెట్టఁబడిరి. రాజోపద్రవము వలనఁ గొందఱును, ప్రభుభక్తివలనఁ గొందఱును యుద్ధముఁ జేసియే తమ ప్రాణబలుల నొసంగిరి.

## మండోదరీ హితవాక్యములు:

మండోదరి రావణుభార్య. రావణునకు వినయముగా హితవు బోధించెను. "నాథా! శ్రీరాముఁడు ప్రజల సౌఖ్యముఁ గోరును తమనాయకుఁడు రాక్షసులెన్నఁడో ప్రజలను బాధించువారు. నియంతయగు ప్రభువు ప్రజలక్షేమముఁ గోరుటకు మాఱు వారి కాంతాకనకంబుల నపహరించుటవలన నెక్కువకాలము పరిపాలింపఁజాలఁడు. దేవతలను లెక్కసేయవు. భూమిలోని జనులనుగూడ బాధించుచుంటివి. ఈ రీతిగా నుభయలోకము లనుఁ గొఱమాలిన యేలికవైతివి. ఇప్పటికైనను మించి పోయినదిలేదు. సీతను శ్రీరామునకు సమర్పింపుము. లంకా రాజ్యమును శాశ్వతముగా నేలఁగలవు. దీనరక్షకుఁడైన శ్రీరాముఁడు నిన్ను తప్పక రక్షించును.

విభీషణునకు లంకారాజ్యమిచ్చెదనని మాటయిచ్చెనే కాని నీవు శరణుఁగోరినచోఁ దన యయోధ్యనైన నీయఁగలడు.

శ్రీరాముఁడు అధికార వ్యామోహము గలవాఁడు కాఁడు. ప్రజలందరు సుఖముగానుండుటకు సర్వదా కోరువాఁడు తన సర్వస్వమును త్యాగము జేసియైనను ప్రజలనుసుఖపెట్టఁగోరును.

అని మండోదరి బహువిధముల హితము బోధింప రావణుఁడు "సతీ ఇంతవఱకయినది ఇక బ్రతికేమి కావలెందును? పవిత్రమగు శ్రీరామ చరితంబుతో గాఁటు నా చరితముకూడ ప్రజలచే రచింపఁబడు గాక. పూర్వుల మాల గూర్చుటకు దారముకూడఁ నవసరమే. శ్రీరామచరితముప్రకాశించుటకు రావణ చరితముకూడ జేర్చఁబడకుండునా!" అనెను.

రావణుఁడు వెంటనే శ్రీరామునితో యుద్ధమునుచేయ మొదలిడెను. పోరుఘోరముగ సాఁగెను. శ్రీరాముఁడు రావణుతో "రావణా! ఈ మాటు నీతీరు వేరుగానున్నది చక్కనిధనుర్విద్యా కౌశలముఁ జూపుచుంటివి. అధర్మయుద్ధమనునది మచ్చునకుఁగూడ గానరాదు. నాకు నిన్నుఁజూచిన సంతోషము కలుగుచున్నది. నేనుధనుర్విద్య నేర్చినది మొదలు నీవంటి నేర్పరితోఁబోరియెఱుఁగను.

రావణా! నాకుయుద్ధమె ప్రధానముకాదు. దుష్టులలోని దుష్టత్వము పోఁగొట్టవలెనుకాని, వారలను చంపుట వివేకముకాదు. చెట్టునుదొలుచు పురుగును దీసివేయుటకు మాఱు చెట్టునుబడఁగొట్టుట తెలివితక్కువ గాదా" అనెను.

పోరు ఘోరమయ్యెను. శ్రీరాముడు జయమందెను. రావణుఁడు అస్తమించెను. దేవతలు శ్రీరాముని స్తుతించిరి. విభీషణుఁడు లంకకురాజయ్యెను.

సీతారామ లక్ష్మణులు తమ సైన్యములతో పుష్పక విమానమునెక్కి యయోధ్యకుఁ జేరిరి. శ్రీరాముఁడు పట్టాభిషిక్తుఁడయ్యెను. ప్రజల యిష్టానుసారము రాజ్యముఁ బాలించెను. అందువలననే రామరాజ్యమను ప్రసిద్ధిఁ గల్గినది. శ్రీరాముఁడు కుశలవులనెడి పుత్రులనుగాంచి యుండటతో నానంద మందుచుండెను.

బాలకులారా! శ్రీరామునివలె స్వార్థత్యాగులై పేరు పొందుఁడు. ఉత్తమనాయకులై ప్రజలను క్షేమంబుగఁ బాలింపుఁడు. పరమత సహనము కలిగి సంచరింపుడు. ఉత్తమ నాయకుల యడుగుజాడలయందు నడువుఁడు. నిరక్షరాస్యతను నిరుద్యోగతను నిర్మూలింపుడు. భారతీయ విజ్ఞానసంపత్తిని ప్రకాశింపజేయుడు. జాతీయతను నిలఁబెట్టుడు. దోపిడిమూకలను దొరలను గానీయకుడు. జాతి, మత, కుల భేదములను మాన్పుడు. సర్వమానవ సోదరభావముతో మెలఁగుడు. చదువు కాలములో రాజకీయ ప్రసంగములు మానుఁడు. ఉత్తమ నాయకులుగండు. ఉన్నతవిద్యను సాధింపుడు. విద్యలేని మిమ్మునెవ్వరు మెచ్చరు. మంచినడవడికగల్గి మెలఁగుఁడు. శ్రీరాముని యాదర్శజీవనంబును మఱవకుడు.

# విజయలక్ష్మీ పండిట్

తే. గీ. భారతీయ కాంగ్రెసు గౌరవములనంది
భారతీయ విజ్ఞానసంపత్తినెల్ల
నితర దేశములందు బోధించినట్టి
విజయలక్ష్మి పండిట్ బోలు వెలది కలదె!

బాలకులారా! శ్రీమతి విజయలక్ష్మిపండిట్‌ను మీరు వినియేయుందురు. ఆమె మన జవహర్‌లాల్ నెహ్రూ సోదరీమణి భారతీయ కాంగ్రెసు ధర్మసమరమునందు గాంధి, నెహ్రూల వలె నీమెయు ధైర్యసాహసములతో బ్రిటిషువారి నెదురొక్కన్నది. అమెరికావంటి యగ్రరాజ్యములకేగి మనభారతీయుల ప్రజ్ఞా విశేషంబులను, మేధాశక్తులను, గౌరవప్రతిష్ఠను ప్రబోధించినది. ప్రపంచ శాంతిస్థాపనకు యత్నించుచున్న దేశ మొక్క భారతదేశమేయని భారతీయుల యదార్ధపరిస్థితులనెఱిగించినది. అప్పటినుండియె భారతీయులకు, అమెరికా సభ్యమానవజాతికిని సుహృద్భావ మేర్పడినది. కనుక నీమె చరిత్రమును మీరు సావధానముగా జదువుడు.

ఔరంగజేబు పరిపాలనలో కాశ్మీరునందు అశాంతి చెల రేగినది. ఆ యలజడిలో నచ్చటి నెహ్రూవంశీయులు ఢిల్లీ వలస వచ్చిరి.

లక్ష్మీనారాయణనెహ్రూ ఢిల్లీలో బ్రిటిషుకంపెనీ వారి ప్రధానన్యాయవాదిగ నుండెను. ఆయన కుమారుడు గంగాధరనెహ్రూ ఢిల్లీనగర కొత్వాలుగ నుండెను.

1857లో సిపాయీల తిరుగుబాటు జరిగినది. అప్పుడు గంగాధర నెహ్రూ సకుటుంబముగా ఆగ్రాపట్టణ నివాస మేర్పరచుకొనెను.

గంగాధరనెహ్రూకు నిద్దరుకుమార్తెలు, ఇద్దరుకుమారులు పుట్టిరి. అందు కడపటిపుత్రుడు పండిత మోతీలాలునెహ్రూ.

మోతీలాలునెహ్రూభార్య స్వరూపరాణి ఆమె కాశ్మీరములోని సుప్రసిద్ధ బ్రాహ్మణకుటుంబమునకు చెందినది. ఆమె రూపవతి, విద్యావతి, గుణవతియునని పేరందెను.

ఈపుణ్యదంపతులకు జవహరులాలునెహ్రూ 14-11-1889 లో జన్మించెను. 18-11-1900లో విజయలక్ష్మి పండిట్ జన్మించెను. వారి యీ కుమారుడును, కుమార్తెయు యావత్ప్రపంచముప్రసిద్ధి జెందిరి.

మోతీలాలునెహ్రూ న్యాయవాది వృత్తియందు అలహాబాదులో ప్రసిద్ధి చెందియుండెను. ఆకుమారుడు కుమార్తెయు క్రమముగా పెరిగిపెద్దవారై హూణవిద్యయందు కృతార్థులైరి.

తండ్రికి వేటయనినను, అశ్వారోహణమనినను నధికోత్సాహము. ఆ యశ్వారోహణ నిపుణత బిడ్డలకునుగల్గినది.

బిడ్డలు చదువుకొను కాలములో మోతీలాలునెహ్రూ సకుటుంబముగా యూరపుదేశమునకు వెళ్ళవలసివచ్చెను. అచ్చట తనకుమార్తెయగు విజయలక్ష్మీపండిట్‌కు హూణభాషలో మంచినిపుణత చేకూర్చవలెనని సంకల్పించెను. ఈ తమవంశ సంజాతయు, బోధన పద్ధతియందు నిపుణతగల విదుషీమణియగు మిస్. హూపర్ అను ఇంగ్లండువనితా శిరోమణి నుపాధ్యాయురాలిగ గుదిర్చెను

ఆ యుపాధ్యాయురాలు లక్ష్మికి వ్రాయుట చదువుట మాత్రమేకాక ధారాళముగా మాటాడుటకూడ నేర్పెను. ఆ నేర్పు క్రమముగా మహాసభలయందును మాటాడగల శక్తిగా ప్రకాశించినది.

పిదప మోతీలాలునెహ్రూ భారతదేశమునకువచ్చి తన న్యాయవాది వృత్తియందు జేరెను. లక్ష్మికి 15 సంవత్సరముల వయస్సు. ప్రథమ ప్రపంచ మహాసంగ్రామము నేడో రేపో రానున్న గడ్డురోజులు.

జవహరు పండితుడు ఇంగ్లాండునుండి మరలివచ్చి తండ్రితోబాటు అలహాబాదులో న్యాయవాదిగ నుండెను. కాని, దేశపరిస్థితులనుబట్టి యాతని మనస్సు జాతీయధర్మ సమరమునందు చేరుటకు సిద్ధపడుచుండెను.

లక్ష్మి 1915 లో బొంబాయిలో జరిగిన ఇండియన్ నేషనల్ కాంగ్రెసుకు తండ్రితోవచ్చి యచ్చటి కార్యకలాపములను, చర్చలను, బహుశ్రద్ధతో నాలకించెను. అప్పటినుండి యామెకు రాజకీయములయందు పట్టుదల యెక్కువయినది.

బ్రిటిషు ప్రభుత్వము "యుద్ధానంతరము భారతీయులకు స్వాధ్య సాయుత రాజ్యాంగము నిచ్చెద"నని వాగ్దానమిచ్చి సహాయము గ్రహించినది. తరువాతకూడ బ్రిటిషువారు తమ నిరంకుశ పరిపాలన సాగించుట మహానాయకులకేకాదు, మన లక్ష్మికినాగ్రహము కలిగించినది.

ప్రజలలో జాతీయ ధర్మసమరము నడుపవలెనను పట్టు దల యెక్కువయినది. గాంధిగారు "ప్రజలు ప్రభుత్వోద్యోగములనుమాని సత్యాగ్రహము చేయు"డని ప్రబోధించెను. నెహ్రూ కుటుంబముగూడ తండ్రికొడుకులిద్దరును తమ న్యాయవాది వృత్తులను విడనాడిరి.

నాగపూరు కాంగ్రెసు తీర్మానము ననుసరించి ప్రజలు సహాయ నిరాకరణోద్యమము సాగించిరి. నెహ్రూకుటుంబము లోని తండ్రికొడుకు లిద్దరును ప్రభుత్వమువారిచే నిర్బంధింపబడిరి.

ప్రజలు రెచ్చిపోవుటచే ప్రభుత్వము చేయునదిలేక జాతీయ వాదులనెల్లరను విడిచిపెట్టినది.

లక్ష్మి రంజిత్ పండిట్ గారి మంచిగుణములను విని ప్రేమించెననియెంచి తండ్రివారిద్దరికి వివాహము చేసెను.

నెహ్రూపండితుడు తనభార్యకు చాలజబ్బు చేయుట చేత యూరపులో చికిత్స జేయించవలెనని సంకల్పించెను. ఆ జబ్బుగానున్న కమాలానెహ్రూతోబాటు లక్ష్మియు నామెభర్త రంజిత్ పండిట్ ను ప్రయాణమయిరి. ఆసమయమున

తన భర్తతోఁగలసి లక్ష్మి యూరపులోని పలు తావులనుసందర్శించెను. దానివలన నామెకు రాజకీయపరిజ్ఞాన మధికమయ్యెను. తరువాత కొలది కాలమునకు హిందూ దేశమునకు తిరిగివచ్చెను.

ఉప్పుసత్యాగ్రహము చేయురోజులలో గాంధీ, నెహ్రూ మొదలయినవారు నిర్బంధింపఁబడిరి. అప్పుడు లక్ష్మి "ఉప్పుపుట్టిన దోషమా?" అని రోషముతో రాజకీయ రంగములకుదుమికి యుపన్యసించినది. హర్తాలు జరిపించినది లక్ష్మికి 144సెక్షను ప్రభుత్వమువిధించినది. మఱింతరోషముతో నుపన్యసింపసాగినది.

27-1-1932న ప్రభుత్వము లక్ష్మి నరెస్టు చేసి కారాగారమున నుంచిరి. లక్ష్మితన రెండున్నర సంవత్సరముల వయస్సుఁగల చిన్నకుమార్తెను గూడవిడచి మహదానందముతో లక్నో కారాగారమున నొక్క సంవత్సరము కఠినశిక్ష ననుభవించెను.

లక్ష్మితరువాత కాంగ్రెసు నాయకుల యాదేశాను సారము స్థానిక సంస్థలలో ప్రవేశించి పనిచేయవలెనని సంకల్పించి యుఱికెను.

1935లో అలహాబాదు మ్యునిసిపాలిటీ సభ్యురాలుగ నొకగొప్ప ధనికురాలితో పోటీసల్పి విజయమందెను.

ఆ సమయమున నే అలహాబాదులోని విద్యాసంఘమున సభ్యురాలై యా సంఘసభ్యులచే నేకగ్రీవముగ నధ్యక్షురాలుగ నెన్నుకొనఁబడినది. ఆపదవియందామె పదునెనిమిది మాసములు పనిచేసి విద్యావిషయమున ననుభవమును గొంత

సం[పా]దించుటయేకాక యా [విభా]గములందున్న లోపములను గొన్నిటిని సవరించెను. జాతీయవిద్యావిధానమునకు పునాదులు వేసెను.

1937సంIIలో సంయుక్త రాష్ట్రములందు అసెంబ్లీ యెన్నికలు ప్రారంభమాయెను. అందు లక్ష్మిగారు పాల్గొన వలసినదని సభ్యులు ప్రోత్సహించిరి. స్థానిక సంస్థలలో మున్ను పొందిన యనుభవమునుబట్టి "యధికారమందున్నప్పుడే తాను రాష్ట్ర ప్రజలకెక్కువ సహాయపడవచ్చు"నని యెంచెను.

సంయుక్త రాష్ట్రముల శాసనసభలో మహిళలకై యొకస్థానము ప్రత్యేకింపబడెను. ఆ స్థానమునకప్పుడే యు. పి. రాష్ట్రవిద్యాశాఖామంత్రిగారి భార్యయైన శ్రీవత్సన యను విద్యావతి నామినేషను దాఖలు చేయుటయు నది యంగీకరించుటయు జరిగెను.

ఆ పైన విజయలక్ష్మికూడ నామెకు పోటీగా దాఖలు చేసిన నామినేషను పత్రముకూడ సమ్మతించిరి. శ్రీ వత్సనకు ధనము వర్షించినది. లక్ష్మితన సౌజన్యమును వర్షించినది.

శ్రీవత్సన తన గుమాస్తాలద్వారా ప్రచారము చేయించినది. లక్ష్మి జాతీయ పత్రికలద్వారా యుచితప్రచారము చేయించినది.

విజయలక్ష్మి పదివేలవోట్ల యధికముతో విజయ మందెను. జాతీయ ప్రభుత్వమునందు ధనికవర్గప్రభుత్వమిట్లే యెప్పుడో తొలంగుననుభావము ప్రజలకప్పుడే తోచెను.

తరువాత లక్ష్మి కాంగ్రెసు నాయకుల యీ దేశాను సారము సరిహద్దు రాష్ట్రములోని యారోగ్య రక్షణశాఖకు మంత్రిపదవి నలంకరించెను. లక్ష్మి యీ రాష్ట్రములో పలు తావులందు వైద్యశాలలను నెలకొల్పి ప్రజలకు సకలవిధముల నారోగ్యమును కాపాడి ప్రజల మన్ననలనందెను.

లక్ష్మికి ఈ మంత్రిపదవిలోనున్నప్పుడు మరల యూరపు దేశమునకు వెళ్ళుట తటస్థించినది. ఆమె యచట నేమో యత్నములు సల్పుచుండగనే ద్వితీయప్రపంచ మహాయుద్ధము విజృంభించెను. వెంటనే తిరిగి లక్ష్మి భారత దేశమునకు వచ్చెను.

ప్రభుత్వమువారు భారతీయులను యుద్ధములోనికి సహాయము కోరిరి. "సంపూర్ణ సహాయము చేయుటకు సంపూర్ణ స్వరాజ్యము కావలెను. వెనుక నేయీ మాటలనువిని మోసపోతి" మని భారతీయులు సమాధానమిచ్చిరి.

1940 సం॥లో భారతీయ నాయకులెల్లరు తమతమ ప్రభుత్వోద్యోగములకు రాజీనామాలిచ్చి సత్యాగ్రహధర్మ సమర మారంభించిరి. లక్ష్మికూడ సత్యాగ్రహమున పాల్గొని యరెస్టు కావింపబడెను. నాలుగు మాసములు సామాన్య ఖైదుశిక్ష విధించి నైనీసెంట్రలు జైలునకు పంపెను ప్రభుత్వము. ఆ శిక్షాకాలము పూర్తియయిన వెంటనే మరల లక్ష్మి నాయకులందరితో పాటు దేశసేవజేయుట కుపూనినది.

1942 ఆగష్టు 12వ తేదీన మధ్యాహ్నము 2 గంటలకు పోలీసువారు లక్ష్మినరెస్టు చేయవచ్చిరి. ప్రజల విప్లవమునకు ఆమెయు కారణముకాబోలు! రెండులారీలనిండ సైనికులు

తుపాకులతో వచ్చిరి. ఒకజీబులో పోలీసు అధికారులువచ్చిరి.

వారినందరినిచూచి లక్ష్మి "నిరాయుధురాలైన యొక్క స్త్రీని అరెస్టు జేయుటకు ఇంతమంది ఇన్ని యాయుధములతో రావలెనా!" న్నది.

వెంటనే లక్ష్మి నరెస్టుజేసి నైనిటాలు జైలుకుం గొంపో యిరి. లక్ష్మి తనకు విధించిన 9 మాసముల శిక్షననుభవించి తన యారోగ్యము చెడిపోవ నింటికిం జేరెను.

1944 లో తనయు లిద్దర మెరికాలో చదువందలంచిరని పూజ్య బుట్టించి, తనకుమార్తె నిద్దరిని, యమెరికాలోం జదివించుచుండెను.

ఆమెయు నచ్చటికేంగి యమెరికాలో బ్రిటిషువారి దూతలుచేయు దుష్ప్రచారమును శక్తినంచనలేక ఖండించెను.

బ్రిటిషు దూతలు "గాంధియు, నితర నాయకులును, జపానువారి కేజంట్లు. హిందూ దేశములోని ధనికులైన పెట్టుబడిదార్ల మద్దతుతో ఫాసిష్టు పద్ధతులను కాంగ్రెసు అనుసరించుచున్నది ఆపెట్టుబడిదార్లే బ్రిటిషుప్రభుత్వమక్కరలేదని చెప్పుచున్నారు." బ్రిటిషువారు హిందూదేశమును వీడినచో మైనార్టీ పక్షములవారికి ద్రోహము జరుగును." అని యమెరికాలో దుష్ప్రచారముచేసిరి.

"ఆ సమయములో కాంగ్రెసు నాయకులు కారాగారమున బంధింపంబడినారు. వారెన్నో కష్టములకు, నష్టములకు

గూడ నోర్చుకొనియున్నారు. వారిని విడచిన కొంపమునుగు నని బ్రిటిషు వారు భయపడుచున్నారు" అని లక్ష్మి యమెరికాలో ప్రబోధించెను.

విజయలక్ష్మిపండిట్ బ్రిటిషు దూతలు పల్కిన వాక్యములు యథార్థములు కావనియు, సత్యము నిలువడమీద చక్కగా తెలియుననియు, ఇండియా వంటి పెద్ద దేశమును బ్రిటిషు వారొక్కరే పట్టుట న్యాయము కాదనియు, ఒక దేశముపై నితి యొక దేశము నిరంకుశ పాలనము కొనసాగించుట సభ్యమానవజాతికి కళంకమనియు, భారతీయులు బానిసలుగా నున్నంతవరకు దేశములో యుద్ధములు తప్పవనియు నమెరికాలోని పలు తావులందు ప్రబోధించెను.

లక్ష్మి యమెరికాలో నున్నప్పుడే యా దేశమునందలి సుప్రసిద్ధ చారిత్రాత్మక నగరరాజంబగు శాన్‌ఫ్రాన్సిస్కో మహాపట్టణమున నొక శాంతిమహాసభ మిత్రమండలివారు జరుపనుద్దేశించిరి. అప్పుడు భారతదేశము బ్రిటిషువారు పెట్టెడు కష్టములయందు, నష్టములయందు క్రుంగుచున్నది. శత్రువుల ఘోరశస్త్రాస్త్రములకు బ్రిటను కూడ నేలమట్టమగుచుండెను. బ్రిటనులోని ధనికవర్గము విమానములమీద నమెరికాకు పారిపోవుచుండెను. యూరపువంటి సేమూాల చూచినను నాజీదురాక్రమణ మధిక మగుచుండెను. ఇంత యయినను భారతీయ నాయకులతో బ్రిటిషు వారికి రాజీ కుదరలేదు. రాజీమాటలు జరుపుటకే యంగీకరింపరు.

ప్రపంచమున శాశ్వతశాంతి నెలకొల్పుటకును, నాజీజము ఫాసిజము, అను శృంఖలములనుండి యూరపు ఖండమును విడుదల నొందించుటకును, శాన్‌ఫ్రాన్సిస్కో సమావేశము నేర్పాటుగావించిన మిత్రమండలి నాయకులు భారతీయులయుత్తర వున భారత దేశమునుండి ముగ్గురు ప్రతినిధులను తీసికొనిపోయిరి.

వారు ముగ్గురు బ్రిటిషు చేతిలోని కీలుబొమ్మలు. ప్రజానుమతిని వచ్చినవారుకారు. వారు పేరుపొందిన నాయకులు కారు.

(1) సర్. ఫిరోజ్ ఖాన్ (2) సర్. రామస్వామి (3) యం. కృష్ణమాచార్యి.

మొదటివాడు పిచ్చి పిచ్చిగా వాగివచ్చెను. "నిజము చెప్పుచున్నాను. భారత దేశము స్వాతంత్ర్యము సంపాదించినది. బ్రిటిషువారు అధిక దేశప్రతిపత్తి నిచ్చిరి. వైస్‌రాయి ఎగ్జిక్యూటివ్ కౌన్సిలువారు స్వతంత్రించి దేశరక్షణమునకే యోపయోగముల ననుసరించినను రాజప్రతినిధి ఆడ్డంకులు పెట్టడు" అనిపాఠము నప్పగించెను. ఈ సంభాషణవిని వివిధ దేశ రాజకీయవేత్తలు నవ్విరి. సరే వీరినితీసుకునిపోయినవారుకూడ విరుగబడినవ్విరి. అమెరికాలోని వివిధ ప్రముఖులు "ఇంతకంటె ప్రముఖులిండియాలో లేరా!" యని ప్రశ్నించిరి. బ్రిటిషుదొరలు మౌనము వహించిరి. ఇది బ్రిటిషు వారి కుతంత్రమనిభావించిరి.

ఈ గందరగోళములో మిగిలిన యిద్దరు మాటాడజాలక పాఠము మరచిపోయి గ్రుడ్లుమిటకరించిరి. దేశద్రోహులగతి యిట్లేయుండును. వారు ముప్పురకు బ్రిటిషు

వారు ఏమాత్రము ధనమివ్వలేదు సరికదా "మీబోటి మట్టి బుఱ్ఱలకు మేమెంతఁజెప్పిన లాభములేదు. ఛీ, ఛా" యని చివాట్లువేసి పంపివేసిరి.

ఇండియాలోనికి వచ్చియు వీరుముగ్గురు నగుబాట్ల గతితో దేబెముఖములతో సంకటీకసహాయులుగాఁ గనుపట్టిరి. వారిని దూషింపని వారులేరు

ఇండియానుగూర్చి తాను చెప్పదలచినది లక్ష్మి తెలియఁజేసినది. వెంటనే [illegible] సభ్యులు, అధ్యక్షుఁడు నంగీకరించిరి. ఆమె గంభీరోపన్యాససారము.

"ఈ సమావేశమునకు వచ్చిన ఇండియా ప్రతినిధులు ముగ్గురు బ్రిటిషు నిరంకుశ పరిపాలనాధికారులచేతి కీలుబొమ్మలని బుద్ధిమంతులకు తెలిసియే యుండును. అదియుగాక వీరికి స్వతంత్రముగా మాటాడుశక్తి లేదు. సామర్థ్యముగల నాయకులతో మాటాడి వారియనుమతితో వచ్చినవారు కారు. రాజప్రతినిధి వీరిముగ్గురను తీసికొనివచ్చి పాఠములను నేర్పెను పాపము వీరేమి చేయుదురు? మందమతులు పాఠముమరచి పోయిరి.

హిందూ దేశమునకు అధినివేశ ప్రతిపత్తి లేదు. అది క్రిప్సు మాయమాటలతో నాగిపోయినది. ఇప్పుడు హిందూ దేశమున ప్రముఖనాయకులు కారాగారమున మగ్గుచున్నారు [illegible] బ్రిటిషువారు వారిదూతలు అమెరికాలో ప్రచారము సల్పినారు. ఆమాటలు యదార్థమని భావింపకుడు

ఇండియావంటి పెద్దదేశము స్వాతంత్ర్యములేకుండ నుండుట అన్యదేశములవారికి క్షేమముకాదు. వెంటనే హిందూదేశమునకు స్వాతంత్ర్యము వచ్చునట్లు ఒక తీర్మానము గావింపుడనికోరెను.

మఱియు "మాదేశపు శాంతిభద్రతలు కాపాడుభారము మీ పయినున్నది. ఇంపీరియలిజము నశించవలెననిన హిందూదేశము స్వతంత్రముదేశముగ పరిగణింపఁబడవలెను" అని యుద్ఘాటించెను.

ఆ మహాసభలో మోలటావునిలబడి "శ్రీమతి విజయలక్ష్మి పండిట్ చెప్పినమాటలు నిజమే" యని గంభీరముగా నుపన్యసించెను. అతడిటుల నింకను మాటాడెను.

ప్రపంచశాంతి ప్రపంచశాంతి యనుచు బల్లగుద్దుచు మాటాడువాఁడే ప్రతివాఁడును. ఇప్పుడు మించిపోయినదే మున్నది? ఇప్పుడేల భారతదేశమును స్వతంత్రదేశముగ పరిగణించఁగూడదు. దీనికి బ్రిటిషువారు సమాధానమేమి చెప్పెదరు? మీ నిరంకుశ పరిపాలనవలన ప్రపంచశాంతి కలుగునా? భారతదేశము స్వతంత్రముగా నుండనంతవరకు ప్రపంచములో పెద్ద పెద్ద యుద్ధములుతప్పవు. ప్రపంచ శాంతియుండదు" అని ప్రబోధించెను.

మిత్రమండలివారు "ఈ సమావేశము హిందూదేశ స్వాతంత్ర్య విషయము మాటాడుటకుకాదు. ప్రపంచశాంతి విషయమే చర్చింపఁదగును" అనిజవాబిచ్చిరి.

అందఱు నవ్వుచు కోలాహలముచేసిరి. "హిందూదేశ స్వాతంత్ర్యముకూడ ప్రపంచ శాంతియే యగు"నని కేకలు పెట్టిరి. ఆ కేకలు, ఆగందరగోళము బ్రిటిషువారికి గ్రుక్కత్రిప్పనిచ్చినవి కావు.

తరువాత లక్ష్మి యామహాసభాధ్యక్షుండగు ట్రూమను తోడను, అతని భార్య తోడను మాటాడి యనేకసభలు సమావేశములు జరిపి అచ్చటినుండి ఈజిప్టు, ఇరాక్. అరేబియా దేశముల ప్రధానులతో సంప్రదించి కొన్నిసభలు జరిపి భారత దేశ యథార్థ పరిస్థితిని తెలియఁజెప్పెను. ఆ దేశములలో బ్రిటిషువారి దూతలు భారతదేశమునుగూర్చి చేసిన దుష్ప్రచారమును ఖండింప మొదలిడెను. మొదట "లక్ష్మి మాటలు నిజములేనా?" యని యనుమానించి వినివిని యందఱు "లక్ష్మిమాటలు నిజములే"యని నమ్మిరి.

తరువాత 1945 మే 14 వ తేదిని సంస్థానముల బడ్జెటు విషయమై యుపన్యసింప రావలసినదని కాలిఫోర్నియా శాసనసభవారు సగౌరవముగా లక్ష్మినాహ్వానించిరి. ఆమె యుపన్యాసము విను కుతూహలముతో జనులు వేలకొలదిగా వచ్చిరి. ఆమెగంభీరముగా నుపన్యసించెను.

లక్ష్మి సంస్థాన విషయములనుగూర్చి యేవోకొన్ని వాక్యములు ముచ్చటించి తరువాత "నలుబదికోట్ల జనభాగల భారత దేశము బానిసవృత్తిలో నున్నదన్న సభ్యమానవజాతికి సిగ్గుకలుగుట లేదా? అమెరికావంటి సభ్య దేశముపట్టు బట్టిన

నది కాంజాలని విషమ విషయమూ! భారత దేశమునకు స్వతంత్రము లేనినాడు ప్రపంచశాంతి యెట్లు కుదురును! యని ప్రబోధించెను.

మఱియొకదినమున కాలిఫోర్నియా నగరములో నే సంయుక్త రాష్ట్ర సమ్మేళనము జరిగినప్పుడు 500 సభ్యులు పేరులున్న మహాసభలో నాయకురాలు గలపును దేశముతో "కారు మేఘములవలెనున్న హిందూ దేశ రాజకీయములు నాకు జ్ఞాపకమువచ్చుచున్నవి. ఇప్పటి రాజకీయ విషయములెంచుక జరుగుచునేయున్నవి కాని మనకింకను స్వాతంత్ర్యము లభింపలేదు. మనము చాలా కాలమునుండి స్వాతంత్ర్యపోరాటమును జరుపుచునేయున్నాము.

అది కేవలము మా దేశము విషయమే కాదు. ప్రపంచమున బానిసలుగా బ్రతుకు ప్రజలు నివసించు నన్ని దేశముల విషయమై గూడ" నని తెలిపెను.

పిదప నమెరికా ప్రజలనుగూర్చి "మా స్వాతంత్ర్య సమరము ఇప్పటిలో నణగిపోదు. భారత దేశమునకు స్వాతంత్ర్యము లభించినచో మిగిలిన చిన్న చిన్న దేశముల కన్నిటికి స్వాతంత్ర్యము లభించును. ఫాసిజము నణగద్రొక్కవలెనని యత్నించుచున్నారు. కాని, ఫాసిజమునకు, ఇంపీరియలిజమునకు కారణము ను తెలిసికొనుట లేదు. ఆ రెంటిని గూడ నణగద్రొక్కినప్పుడే ప్రపంచశాంతి యేర్పడును. అంతవరకు నిట్టి సమావేశము లెన్ని జరిపినను శాంతిభద్రత లేర్పడజాలవు" అని మరల మరల బోధించెను.

ఇట్టుల లక్ష్మి ఇతర దేశములయందును మన దేశము నందును గొప్పకీర్తినార్జించిన ధీవనితయు, త్యాగవనితయు నయ్యెను.

భారతదేశము సంపూర్ణ స్వాతంత్ర్యము బొందిన తరువాత విజయలక్ష్మిపండిట్ సోవియట్ రష్యాలో ఇండియా రాయబారిగా పనిచేయుచున్నది.

బాలురారా! విజయలక్ష్మిపండిట్ సంపాదించిన విద్యను బుద్ధిని, ధనమును, తన దేశమునకై యెట్లు త్యాగము జేసినదో చూచితిరా? ఈమె నెహ్రూకుటుంబమునకు వన్నె తెచ్చిన నారీమణి. భారతమాతకు ముద్దుబిడ్డ. మహిళామండలిలో వీరవనిత. రాజకీయములలో నంది వేసిన చెయ్యి. స్వాతంత్ర్య సమరములలో ననేక కష్టములను బొందుటలో నామెకు సాటి యామెయే. గాంధిజీ నడుగుజాడలో నడచుటకు పేరుగాంచిన సాధ్వీమణి లక్ష్మియే.

బాలికామణులారా! మీరును లక్ష్మివలె జదువుడు. సమయము వచ్చినప్పుడు దేశమునకై ధర్మసమరము నడుపుడు. విజయలక్ష్మిపండిట్ ఆదర్శజీవితమును మరచి పోకుడు.

# 6. ఖాన్ సోదరులు

తే. గీ. జాతిమతములుగోడ ప్రసక్తి లేక
గాంధిజీ యాశయముల గలసి మెలసి
యున్న ఖాన్‌సోదరులవంటి యుత్తములగు
మానవు లరుదుకద! ముసల్మానులందు.

బాలబాలికలారా! సరిహద్దు రాష్ట్రములో విశాల హృదయులు, విద్యావంతులు, త్యాగులు, నయిన ఖానుసోదరుల చరిత్రము మీరు కొద్దిగనో గొప్పగనో యిదివరలో చదివి యుందురు. మానవసేవలో నిమగ్నులగుటకు జాతిమతములకు తారతమ్యము, ఎక్కువతక్కువల పరిశీలన, ధనదారిద్ర్య భేదము లనవసరములు. ఎల్లరకును ధర్మాధర్మ విచక్షణ, న్యాయాన్యాయపరిశీలన, దుష్టశిక్షణ, శిష్టరక్షణాదికములుముఖ్యములు. మన దేశమున నట్టివారు కొద్దిగనో గొప్పగానో అన్నిమతములవారిలోను, అన్నిజాతుల వారిలోను గలరు. వారు మాత్రము దేశసేవను, మానవసేవను ముఖ్యముగా గమనింతురు. ప్రజాసేవకే తమ మానధన ప్రాణముల నర్పించిన ఘనులు ఖానుసోదరులు. వారి చరిత్రమును మనము చదివి తెలిసికొనుట మనధర్మము.

పెషావరుజిల్లాలోని చెరవద్దా తాలూకాలో ఉత్మాజలుయను గ్రామముకలదు. అందు బెహరాంఖాను కిరీటములేని రాజు. అతని కిద్దరుపుత్రులు. మొదటివాఁడు డాక్టరు ఖాను సాహెబ్. ఇతఁడు 1883 సం॥ న బుట్టెను. రెండవవాఁడు అబ్దుల్ గఫూర్ ఖాను ఇతఁడు 1890 సం॥ జన్మించెను.

ఈ సోదరుల జనకుఁడు మిగుల సచ్ఛరితుఁడు. ఆయన గుణసంపత్తినిగూర్చి చెప్పవలెనన్న నజాతశత్రుఁడే యన వలయును. ఆయనకు వేఱెశత్రువులు లేకున్నను బంధువుల లోనె చాలమంది విరోధులయిరి. వర్ణాంతరులతో సంబంధ బాంధవ్యములను పొందినవాని కాత్మబంధువులతో విరోధము పొసగుట సహజమే.

బెహరాంఖాను బంధువులచే బాధింపఁబడెను. శక్తి యున్నను వారినిమాత్రము తాను బాధింపలేదు. పగతీర్చు కొనుట యనునది యెఱుఁగఁడు. మోసగించుటయే యన్యా యము. కాని, మోసగింపబడుట యన్యాయముకాదని ఆయన నమ్మియుండెను.

ఇతడు ఆడినమాట నిల్పుకొనుటలో నష్టమును కష్ట మును భరించిన హరిశ్చంద్రుని కేమాత్రము తీసిపోఁడు. ఆయన మంచివాఁడని యా ప్రాంతమునఁజాల పేరందెను. వందలాదిగ నచ్చటివారు తమధనము నాయనకడ దాచుకొని రసీదడిగిన వారు లేరట.

ఆయన జీవితములోనెట్టిసమయమునందుగాని యెరుల కడ చేయిచాచుటగాని, అధికారుల ప్రాపక మార్జింపను నిచ్చకములు పలుకుటగాని యెఱుఁగఁడు.

గొప్పయుద్యోగస్థులుసైతమాతని పేరువిన్నచో వణఁ కుదురు. ఎందరో బ్రిటిషుద్యోగులు బెహరాంఖానును "బాబు"

అని పిల్చుటయేకాక, ఆయన సమ్మతింపని పనిఁజేయ భయపడెడువారట!

బెహరాంఖాను చదువుకొన్నవ్యక్తికాడు. అయినను వేదాంతమున బాగుగా తెలిసినవాఁడు.

సరిహద్దు రాష్ట్రము కేవల మొక మారుమూలనున్న దేశము. అచట విద్యాభిలాష గాని, విద్యాభివృద్ధికి ప్రోత్సాహ కరములైన సదుపాయములు కాని లేవు అజ్ఞానాంధకార బంధురమన్నను తప్పులేదు. ఆప్రదేశమట్లుండుటకు కారణము బ్రిటిషువారి కుతంత్రికమే.

ఆప్రాంతమున నాధునిక పాఠశాలలు నామమాత్రము నకుఁ బెదపట్టణములయందే కలవు. ఆరాష్ట్రవాసుల కన్నీరు తుడుచుట కేర్పరుపఁబడినవి.

నాటి మౌల్వీలు, ముల్లాలు ఆధునిక పాఠశాలలకు తమబిడ్డలను పంపువారలను తిరస్కారదృష్టితోఁ జూచెడు వారు. బెహరాంఖానుమాత్రము ఆ మతగురువులేమనుకొన్నను లెక్కచేయక పాశ్చాత్యవిద్యకై పెషావరులోని మిషన్‌పాఠశాలలో తన పుత్రులను ప్రవేశపెట్టెను.

డాక్టరు ఖానుసాహెబు విద్యయందే పట్టుదలగలవాడు గఫూర్‌ఖాను విద్యయందు తక్కువ. రాజకీయములయందు పట్టుదల యెక్కువ కలిగియుండెను.

డాక్టరుఖాను పంజాబు విశ్వవిద్యాలయమున మెట్రికు పరీక్షలో ప్రథమ శ్రేణిలో నుత్తీర్ణుడయ్యెను. తను

నాత బొంబాయిలోని వైద్యకళాశాలలో డాక్టరు పరీక్షకొరక సంవత్సరము మాత్రమే చదివి తండ్రి ప్రోత్సాహమున నింగ్లాండు లోని వైద్యవిద్యాలయమున నున్నత పరీక్షలం జదివెను.

పెద్దకుమారుడింగ్లాండు పోవుటచే బంధువులకెంతో కష్టముకలిగి యెన్నోమాటలనిరి. ఎంతెంతో వ్యతిరేకముగఁ బ్రవర్తించిరి. కొందఱు "క్రైస్తవమతమవలంబించి"నారనిరి. కొందఱు "ఇంక ఇంగ్లాండునుండి వచ్చునా" యనిరి. మఱి కొందఱు "దొరసానిఁ బెండ్లాడును వెలివేయఁబడును" అనిరి.

గఫూర్‌ఖాను మాత్రము మెట్రికు పరీక్షలో నుత్తీర్ణుడు గాకపోయెను. కాని తండ్రి యీ రెండవ పుత్రునిఁగూడ నింగ్లాండుకుఁ బంపనుత్సాహపడెను.

తండ్రిమరల గఫూరును చదివించి యెట్లైన నింగ్లాండుకు పంప దలచెను. కాని యాసంవత్సరములో వారికుటుంబములోని మూఁడు నిండుప్రాణములను మృత్యువు బలిఁగొన్నది. ఇది యేకాక "ఇంగ్లాండులోని డాక్టరుఖాను దొరసానిఁ బెండ్లాడె" ననువార్త వచ్చినది. అందువలనను ద్వితీయ పుత్రు నింగ్లాండు పంపెడు నుత్సాహము తగ్గిపోయినది. ఇదియే కాక గఫూరుచదువుటయె మానుకొనెను.

గఫూర్‌ఖాను స్వల్పవిద్యఁ గలవాఁడైనను రాజకీయములయందు మిక్కిలి వివేకమును సంపాదించెను. తాను చదువుకాలమునందే జాతీయ సేవాదీక్షపూనవలెనని పట్టుపట్టెను.

తన జాతీయదీక్షకు పునాదిగా సేనలోఁజేరి సైనికుఁడుగా పేరందఁదలఁచెను. దరఖాస్తు పెట్టుకొనెను. అన్ని విధముల పెద్దవంశములోని వాఁడగుటచే దరఖాస్తుమంజూరైనది. కాని యింతలో నింటియిబ్బందులు వచ్చుటవలన నన్నిఁటితోపాటు దానికిని స్వస్తి చెప్పవలసి వచ్చెను.

అతఁడు సైన్యములోఁ చేరక పోవుటలో మఱియొక కారణముకూడ గలదు. ఒక్కప్పుడు ఒకసైనికుఁడు గఫ్పారుఖానుతో "దొరలచే నితరజాతీయులు పరాభవింపఁబడుట నిత్యమును చూచితి"ననెను.

తరువాత గఫ్ఫారుఖాను ఒక సం॥ అలిఘరులో ఉర్దు భాషాభ్యాసముఁ జేసెను. తాను చదువు మానినది మొదలు జాతీయ విద్యయందభిమానము కలవాఁడయ్యెను. కనుకనే తన రాష్ట్రమునందు జాతీయ పాఠశాలలను స్థాపింప ప్రయత్నించెను. కొంతవరకుఁ గృతకృత్యుఁడయ్యెను.

అప్పటినుండి రాజకీయములయందు చొరవగా ప్రవేశింప మొదలిడెను. ప్రథమ మహాసంగ్రామానంతరము భారతీయుల త్యాగమునకు ప్రతిఫలముగ రౌలటుశాసనము ప్రాప్తమయ్యెను.

గఫ్పారుఖాను రౌలటుచట్టము నివారింప మహోద్యమ ననుసరించెను. ఆ రోజులలో సరిహద్దు రాష్ట్రమునంతటను అద్భుతమైన హర్తాళ్ళు జరిగినది. అప్పుడే గఫ్పారును జైలులో

పెట్టిరి. తండ్రి తనగ్రామములో గొప్పసభఁ జేసెను. లక్షల కొలది జనములాసభకువచ్చిరి, వృద్ధుడైన తండ్రియు జైలులో పడెను.

గఫ్ఫారునుజైలులోఁగూడ సంకెళ్ళతోనుంచి యపాయకరమైన ఖైదీగాఁ జూఁచెడువారు. "బిడ్డకెక్కోరి శతవృద్ధుఁడు బైహారాంఖాను ఖైదీయయ్యెను. "వారిద్దరిని ఒకచోట నుండనిండు" అని ప్రజలలోనాందోళనము చెలఁరేగినది. ప్రభుత్వము దక్షరిల్లినది. తండ్రి కొడుకుల నిద్దఱినొక్క చోట నేయుంచినది.

కుమారుఁడు "తండ్రీ! నాకై నీకును దుస్థితి సంభవించెనా?" అనెను. తండ్రి "నాయనా! ఇందులకై నీవు చింతింపకుము. నేనుమహదానందముతో నిన్నుఁ జూడఁగోరి బంధితుఁడనైతి" ననెను.

తరువాత పఠానులు పెద్దపెట్టున నాందోళము గావించిరి. బ్రిటిషుద్యోగులకు తలయెత్తి సంచరించుట కష్టమయ్యెనచ్చట. వెంటనే యా తండ్రిబిడ్డల నిరువురను విడుదలఁ జేసిరి. దానితో వారి పేరు సరిహద్దు రాష్ట్రమందే కాక యావద్భారతమున పేరుమ్రోగినది.

అప్పటికి చదువుకై యింగ్లాండుకేఁగిన డాక్టరు ఖాను సాహెబు లండనులోని సెయింట్ థామసు ఆసుపత్రిలో యమ్. ఆర్. సి. యస్. డిగ్రీసపొంది యుద్ధమునకు వెళ్ళెను. యుద్ధానంతరమాయన ఫ్రాన్సులో పనిచేయుచుండెను. ఆ సమయమునకే సరిగా సరిహద్దురాష్ట్రమున అందోళనము సాఁగెను. తనసోదరునుండి డాక్టరు ఖానుసాహెబు ఒక జాబును

పిదప కొన్ని మాసములకే (1921 సం॥ లో) ఫ్రాంటియర్ రెగ్యులేషను శాసనప్రకారము గఫ్ఫారుఖాను గారు కారాగారమందుంచబడెను

ఈ నిర్బంధమునకు కారణము గఫ్ఫారుఖాను నాగ్పూరు కాంగ్రెసునుండి స్వస్థానమునకు చేరిన వెంటనే నిర్మాణ కార్యక్రమమునందు చురుకుగా పనిజేయ జొచ్చెను. తొ నాలుగు గ్రామములలో నొక జాతీయ పాఠశాలను నెలకొల్పెను. తరువాత దానికి శాఖలుగ రాష్ట్రమునందు పల్లెలలో పాఠశాలలను స్థాపింపయత్నించెను. ఇందు సత్యాగ్రహ మేమాత్రము లేదు. జాతీయ విద్యాభివృద్ధి యొక్క గొప్ప కోరికయును. ఇంతమాత్రమునకే దొరతనము కన్ను కుట్టినది.

బ్రిటిషు ఉద్యోగులు గఫ్ఫారుఖాను తండ్రితో "నీ కొడుకు ఆంగ్లేయులకు వ్యతిరేకముగా ప్రచారము చేయుచున్నాడనియు "రాష్ట్రములో నేయొక్కనికిగాని పట్టని యీ పాఠశాలా నిర్వహణదీక్ష నీ కొడుకునకేల కావలసివచ్చినది. సంస్థను మూయింపుము. లేనిచో మీ కుటుంబమునకు జా చిక్కులు రాగల"వనియు పదే పదే చెప్పుచుండెడివారు.

తండ్రి కొడుకుల మధ్య నీ ప్రసంగ మొకమారు వచ్చిన కొడుకు "నాయనా! నేడీసంస్థను మూయుమనిరి. రేపు మన నమాజమునే నిషేధింతురు. మానవలసిన దేనా? మన దేశీయపక్ష

దానితో తండ్రికి పౌరుషము. పట్టుదల హెచ్చినవి. కొడుకునకన్నివిధముల సహాయముఁ జేయ మొదలిడెను. దొరల మాటలను పెడ చెవిని పెట్టెను. దానితో గఫూరు ఖానుకు మూడేండ్లు కఠినకారాగార నివాస మేర్పడెను.

ఆ జైలులో చాలకష్ట మేర్పడెను. ఊపిరాడని యిరుకు గదిలో నుంచిరి. కఠినమైనపనుల చేయించిరి. పనిలేనప్పు డెల్ల కాలుచేతులకు సంకెళ్ళు తగిలించియే యుంచిరి. అంత టితో నాతని శరీరము గుల్లబారినది. రక్తాతిసారము, నడుము నొప్పి హెచ్చయినవి.

దొరతనమువారు "స్వగ్రామమునందలి జాతీయసంస్థను మూయనక్కర లేదు కాని రాష్ట్రసంచారము మానినచో నిన్ను విడుతుము. గఫూరుఖానును క్షమాపణ కోరుమనిరి. అందుకు గఫూరుఖాను అంగీకరింపలేదు.

జైళ్ళయందు నీచాతి నీచములగు లంచగొండితనము లధికముగ నుండెడివి. కొందఱు శిక్షితులు లంచములిచ్చి పని చేయుననవసరము లేకుండ ననుమతులకును, శిక్షల తగ్గింపు లకును, యత్నించి చరితార్థులగు చుండెడివారు. గఫూరుఖాను లంచము లిచ్చెడివారిని, లంచముల పట్టినవారిని చీవాట్లు పెట్టెడువాఁడట.

ఒకనాఁడొక సిపాయి గఫూరుఖానుతో "అయ్యా! ఈ విధముగా మేము లంచములు పట్టనిచో సుఖముగా జీవింపఁగలమా!" యని దీనముగా బ్రతిమాలెనట!

ఆ సిపాయి గఫ్ఫారుఖాను బోధనములనువిని తన సిపాయి వృత్తికి రాజీనామానిచ్చి వెడలిపోయెనట! అదివిని దొరతనమువారు గఫ్ఫారుఖానునుమరెంత బాధింప దొడఁగిరి. మఱియు నచ్చటనుండి పంజాబు జైలునకు గఫ్ఫారుఖానును మార్చిరి.

ఖానుసర్వదా మహాత్ముని జీవితమును సవిమర్శముగా పఠింపుచు, నందలి నియమముల నక్షరశః పాటించుచుండెడు వాడు. వారమునకొకదినముపవసించుట, ఒకదినముమౌనము వహించుట, నవలంబించి యుండుటచే గఫ్ఫారుఖానునకు "సరిహద్దుగాంధి" బిరుదు వచ్చినది.

గఫ్ఫారుఖాను తనపంజాబు జైలుకాలములో భగవద్గీత మొదలగు మతగ్రంథములను జదివెడువాఁడు ఆ జైలునకు ఆ సమయములోనె యుండమాను దీవులనుండి వచ్చిన విప్లవ కారుఁడు భగత్ రామతో పరిచయమేర్పడి, తన్మూలమున నాధ్యాత్మిక విజ్ఞానము నలవడఁ జేసికొనెను.

హిందూమహమ్మదీయ సఖ్యముకొరకు గఫ్ఫారుఖాను "మతశాస్త్రమును, దాని యావశ్యకతను, గుర్తెరుఁగని వాఁడె మతపిచ్చిగలవాఁడగుచున్నాఁడు. ఆచరణలోలేని మత విశ్వాసము తగదు. ఇస్లాంమతమనఁగా సదాచారము. శ్రద్ధా ప్రేమల కలయిక ఆరాధన. మానవుఁడు ముముక్షువు కావలె ననినచో ఏకేశ్వరోపాసన, సదాచార సంపత్తి, సత్క్రియా చరణ, లలవడిన చాలును" అని చెప్పుచుండెడువాఁడు.

దేశీయ జనమైత్రిచే గఫ్ఫారుఖానునకు, పరదేశీయుల మైత్రివలన డాక్టరు ఖానుసాహెబునకును, సర్వమత సమానముల విశాల దృష్టి యేర్పడినది. ఒకసోదరుఁడు వృత్తిజీవనుఁడై మఱియొక సోదరుఁడు స్వాతంత్ర్యదేశ సేవకుఁడై ప్రసిద్ధి చెందిరి.

నేఁడు గఫ్ఫారుఖాను మతసఖ్యమునకు పరిశోధన పరిభాషలో నిట్లు చెప్పుచుండెడివాఁడు.

"ప్రతి రైల్వేస్టేషనునందును పట్టణ మధ్యభాగముల యందును "హిందూవులకీ, మహమ్మదీయులకీ, హిందూవుల నీరు మహమ్మదీయులనీరు" అని యెందుకు భేదముప్రతిపాదింప వలెను? ఈ యిరుమతములవారు పరస్పరము ఒకరిపాత్రనుండి మఱొకరు నిర్మలజలమును గ్రహించుట దోషమని యెందు కనవలెను?."

ఈ రీతిగా గఫ్ఫారుఖాను హిందూవుల మనస్సునకును, మహమ్మదీయుల మానసములకును నొప్పికలుగఁజేయఁగూడ దనుచు నుద్దేశముతోను, మతసఖ్యముకొఱకు బోధించెడువాఁడు.

హిందూవుల గృహములయందువలెనే తనయింటికి హిందూవులు వచ్చినప్పుడు వారికి శాకాహారమిచ్చుటయేకాక తానుగూడ శాకాహారమే తినువాఁడట. ఒకప్పుడు దేవదాసుగాంధి గఫ్ఫారుఖానుయింటిలో భోజనము చేయవలసి వచ్చెను. ఆయన యున్నంతవరకు (3 రెండుమూఁడు రోజులు) గఫ్ఫారుఖాను ఇంటిలోని వారందరు శాకాహారులయి మెలఁగుచుండిరి.

గఫ్ఫారుఖాను జైలునందుండునప్పుడు హిందూ మహమ్మదీయ సఖ్యమునకై పాటుపడెడువాఁడు. హిందూవుల వలన గీతారహస్యము నెఱుగుచు, వారికి ఖురానులోని రహస్యములను బోధించువాఁడు.

ఒకనాఁడు మౌల్వీ గఫ్ఫారుఖానుతో "మన మహమ్మదీయమతమును వృద్ధిచేయవలెనేగాని, పరమతముల ప్రసక్తి మనకేల? యని యెంతో వినయముగా బలికెనట. అందులకు గఫ్ఫారుఖాను ఆగ్రహమంది యా మౌల్వీతో "మీబోటి మతపిచ్చిగలవారి వలననే భారతములోనున్న మహమ్మదీయులు, హిందువులు పరస్పరము ద్వేషించుకొనుట, చంపుకొనుట, సాగుచున్నవి. వేలకొలది జనులుభయపక్షమునందు మరణించిరి. ధర్మము తెలియనివారు, మతముల యానవశ్యకతను గుర్తింపనేరని మీబోంట్లును ఇంత యనర్థము సంభవించుచున్నను బుద్ధి తెచ్చుకొనరే!" యని మందలించెడువాఁడట.

"మఱియు వారు విగ్రహారాధకులయినచో మనము గోరీలను పూజించుటలేదా? అర్థములేని యీపూజలు సార్థకములనుకొని పరస్పర వినాశకర చర్యలను కల్పించుటకంటె వివేకహీనత కలదా!" యనియు బోధించెడువాఁడట.

మఱియు "జరిగిన కాలములందుగల విద్వేష విధ్వంసక చర్యలను మఱల త్రవ్వుకొని, సామాన్య ప్రజానీకము నుసికొల్పి, హిందూమహమ్మదీయ సఖ్యమును చెడునట్లు చేసి భారతదేశవృద్ధిని విధ్వంసము చేయు వివేకహీనులుగా నుండఁ బోకుఁడని యెలుగెత్తి ప్రబోధించెడువాఁడు

“శివాజీ చెడ్డవాఁ”డని మహమ్మదీయులును, “ఔరంగజేబు చెడ్డవాఁ”డని హిందువులును, తలఁచి తలఁచి వివాదపడి విధ్వంసక చర్యలకుదిగి మన దేశమును మరల పరదేశీయుల శాసిత పాలనలోనికి దింపకుఁ”డని హుంకరించెను.

“మతకర్తలను, మతపిచ్చిని. మతమునందలి యవివేక వాక్యములను, పనులవలన వినియు, తాను స్వయముగాఁ జూచియు, వెకిలినవ్వొకటి చప్పరించెడువాఁడట.

గఫ్ఫూరుఖాను సరిహద్దురాష్ట్రమున స్వచ్ఛంద సేవాదళమును సమకూర్చెను. ఆ దళములోని విద్యావంతులు నియమవంతులు, బలవంతులు, పఠానులను స్వైరవిహారముల నుండి, లూటీలనుండి మఱలించిరి.

మఱియు వారు వారికి విద్యావిధానశిక్షణము నొసంగిరి మంచికట్టుబాట్లు నేర్పిరి. వివాహాదికములందు మితవ్యయమును నియమించిరి. అన్ని పనులయందు సలహాదారుఁడుగాను, నాయకుఁడుగాను, గఫ్ఫూరుఖానునుఁ జూచుచుండిరి. ఆ సరిహద్దునందు గఫ్ఫూరుఖాను చెప్పినది వేదములోని మాటగా అందఱు తల దాల్చిరి.

గఫ్ఫూరుఖాను నాయకుఁడై ప్రజల యాదరాభిమానములను చూఱఁగొని, వారిలోని దుష్టాచారములను తొలగించి, సంఘశ్రేయస్సుకై సంఘసంస్కారము గూడ నల్పెను.

ఆ దళమువారందరు తమ సంఘసంస్కరణ పద్ధతిచే తమకు గల్గిన సుఖమునుగాంచి తమనాయకుని మహోపకారమును, మహోదారతను మెచ్చుకొనిరి.

ఆ దళము క్రమముగా కాంగ్రెసు సంస్థయందలి సమగ్రకార్యక్రమము కొనసాగించు సంపూర్ణ రాజకీయ సంస్థగా 1929లో పరివర్తనమందెను. అప్పటినుండియు నా దళమునకు "ఎఱ్ఱచొక్కాలదళ"మని పేరువచ్చెను.

మంచి తనమున మించుచు జాతీయ రామణీయకము లతో వెలుఁగుచున్న యీదళము బ్రిటిషుద్యోగులకు కంటక మయినదనినచో ఆయుద్యోగుల, కుతంత్రము పాలుట లేదని వేఱుగాఁ జెప్పవలెనా?

బ్రిటిషుద్యోగులీ యెఱ్ఱచొక్కాల దళమును విప్లవ సంఘముగా దూషించిరి. నిజమరయుగా వారట్టివారుకారు. మొదట తెల్లఖాదీదుస్తులతోనే నిర్మింపబడిన యీ యూనిఫారము త్వరలో మలినములు కాకుండుట కెఱ్ఱరంగుదుస్తులగ మార్చఁబడినది.

ఈ సేవకదళము ముఖ్యముగా కాంగ్రెసు సంస్థకు సంబంధించిన కార్యక్రమము ననుసరించి, విదేశవస్త్రశాలలు, కల్లుదుకాణము మొదలగువానివద్ద పికిటింగుచేయ సాఁగెను.

వారనుదినము దేశీయవ్యాయామమును సైనిక పద్ధతితో క్రమశిక్షణతోను నెఱపుచుండిరి. పాదచారులై చాల దూరము నడచివచ్చుట, హస్తమునందు లాఠీలు, ఆయుధ ములు లేకుండఁదిరుగుట, ఎట్టి కఠినశిక్షనైన ననుభవించుట, శిక్షాకాలమునందు నధికారులయందు సత్ప్రవర్తన కలిగి మెలఁగుట, ఆ దళములోని ముఖ్యమయిన కట్టుబాటులు.

నాయకుఁడు. అప్పటి గవర్నరుసతి వహించినను డాక్టరుఖాను ఇంగ్ల భార్యతో మిగుల చనువుగానుండి పరిచితిజనము నిరువురును ఒకచోటఁగూర్చి కాలమును సంతోషముగ గడపుచుండెడు వారట. గవర్నరుకూడ డాక్టరుఖానునను సోదరుఁడునవలె మెలఁగఁజూచువాఁడట.

డాక్టరుఖాను కుమారుఁ డొకఁడు మెట్రికుపాసయి పెషావరులో చదువనేఁగెను అతని కుమార్తెయు, తమ్ముని కూతురును ఇంగ్లపాఠశాలలోనే చదివిరి.

సాదుల్లాఖాను డాక్టరు మొదటిభార్య కుమారుఁడు ఇంగ్లండులో సివిల్ ఇంజనీరింగు డిగ్రీపుచ్చుకొనివచ్చెను. రెండవ కుమారుడు హిందూదేశమంతట డెబ్బదేసిమిది దినములు నిరసనవ్రతదీక్ష బూని ప్రసిద్ధి సహించిన త్యాగమూర్తి. ఇతఁడే ఉబేదుల్లాఖాను. ఇతఁడు కోళ్ళ పరిశ్రమలో నేర్పు సంపాదించి యుందున్నతిపదవినొంద నింగ్లాండునకు పయనమయ్యెఁగాని పన్నుకట్ట లేదని నిర్బంధింపఁబడెను.

గఫూరుఖాను పెద్దకొడుకు అబ్దుల్‌గని పంచదార పరిశ్రమలో చతురత నేర్వనెంచి రెండేండ్లు ఇంగ్లండులోను, కొన్ని సంవత్సరాలు అమెరికాలోను, కాలము గడిపెను.

ఖానురెండవ కొడుకు అబ్దుల్‌వాలి మొన్నటివరకచటనే చదువుచుండెను. వీరికాంగ్లేయాధికారులును, వారిప్రజలతోను, శత్రుత్వమని భావించునారు ఇప్పుడైన నిజముగ్రహింతురుగాక!

ఖానుసోదరులు తుదికారాగార శిక్షలో కాలపరిమితి లేకయేయుండిరి. వీరు తప సిస్తులను చెల్లించిరి. అయినను పగలు చెల్లించుచుండ నిషేధప్రబోధములు కల్గింతురేమో యను ననుమానమున బంధింపఁబడిరి. రాజుతలఁచుకొన్నచో శిక్షించుటకు కారణము దొరకకపోవునా?

డాక్టరు ఖానుసాహెబు రెండవ కుమారుఁడగు ఉబేదుల్లాఖాను పేరిట కొంతభూమికలదు. దానికి చెల్లింప వలసినది చాలస్వల్ప మొత్తము. అందుమూఁడువంతులు చెల్లింపఁబడినది. ఇఁక మూఁడువందలు మాత్రము చెల్లింపవలసి యున్నది. దీనిని నెపముగాఁ దీసికొని ప్రాతపగను సాధించుటకు బంధించిరి. ఉబేదుల్లాఖాను చెరసద్దా కారాగారమున నుంచఁబడెను.

జెయిలులోని పరిస్థితులు చాలనసహ్యముగా నున్నందున వానిని చక్కఁబెట్టించుటకు 38 దినములు నిరశన వ్రతము గట్టి పట్టుదలతో నెఱపెను. వెంటనే యతని యారోగ్యము చెడెను. వెంటనే ఆ ఉబేదుల్లాఖానును విడిచివేసిరి.

అతఁడు తండ్రివద్ద రెండునెలలు మందుపుచ్చుకొన్న తరువాతనే యారోగ్యదశకు వచ్చెను. ఆరోగ్యవంతుడయిన వెంటనే తన స్వగ్రామమునకు వెళ్ళెను. వెంటనే దొరతనమువారు ఆర్డినెన్సు పేరిట అతనిని మరల నిర్బంధించిరి.

ఆర్డినెన్సు పుట్టించి యమలు జరుపుటకు దర్బారును పిలుపు నిరసించుటే కారణమని ప్రభుత్వము చెప్పుచుండెడిది.

డాక్టరు ఖానుసాహెబును, నెహరూ పండితుడును, అలహాబాదులో క్రిస్మసు పండుగదినములయందు నొక్కచోటనుండియే కాలక్షేపముజేయదలంచికొనిరి. ఈ మైత్రిలో నేమిపుట్టునోయని భయపడి ప్రభుత్వము యిరువురను ఇరువురను దూరప్రదేశములయందు వేఱుగా నిర్బంధించిరి.

ఆ సమయముననే డాక్టరు ఖానుపెద్దకుమారుడు సీమనుండి స్వదేశముచేరి రాష్ట్రీయ కాంగ్రెసు కమిటీకి కార్యదర్శిగా నియమింపబడెను. ఆ ధైర్యశాలియగు సాదుల్లాఖానును కూడ నిర్బంధించి తండ్రులను గొనిపోవు ప్రత్యేకపు రైలులో నెక్కించిరి.

అప్పటికి రెండు దినముల క్రిందటనే స్వగ్రామమునకు వచ్చిన డాక్టరు ఖానుభార్యపిల్లలు మున్నగు కుటుంబమంతయు నొకరేయి గాఢనిద్రలో నుండు సమయమున పోలీసువారు ఇంటిసోదాకైవచ్చి వెంటనే ఇల్లు ఖాళీ చేయవలసినదని హంగామా చేసిరి.

డాక్టరు ఖానురెండవ కుమారుడగు ఉబేదుల్లాఖానును నప్పుడే అరెస్టుచేసి నిర్బంధించిరి. ఇతడప్పుడనారోగ్యవంతుడుగా నేయుండెను.

తండ్రిని బిడ్డలను ఒకేసమయమున నిర్బంధించినను వారిలో నే యిరువురనుగాని కలిపి యొకేజైలులో నుంచుట కిష్టపడక ప్రభుత్వము డాక్టరు ఖానును అలహాబాదులోని నైనీ చెరసాలకును, గఫూరుఖానును హజారీబాగు చెరసాల

కును, సాదుల్లాఖానును వారాణాసి జైలునను, ఉబేదుల్లాఖానును మఱియొక చోటునకును, తీసికొనిపోయి నిర్బంధించిరి.

ఉబేదుల్లాఖాను నిరశన వ్రతమువలంబించెను. ఆ సమయమున నతఁడు చనిపోవనున్నాఁడని తెలియవచ్చినను ఆ సోదరులించుకయు చలింపలేదు.

బాలకులారా! ఖానుసోదరుల సద్గుణములు వర్ణనాతీతములని తెలిసికొంటిరి కదా! వారు సాటిలేని త్యాగధనులు.

తమ దేశ ప్రజల సుఖమునకై తమ దేశ స్వాతంత్ర్య సిద్ధికై తమ సర్వస్వమును విడనాడి తమ జీవితములను కష్టముల పాలుజేసికొనిన త్యాగజీవనులు కదా!

వీరి త్యాగదీక్ష, శాశ్వతనిర్బంధము స్వేచ్ఛాప్రవృత్తియు, వారి యనుయాయుల నందఱ నుత్సాహవంతులను జేయుట కుపకరించినవి.

ఏ సమయమునందైనను వారు దౌర్జన్య ప్రోత్సాహకులు, దౌర్జన్యవాదులు, దౌర్జన్య బోధకులును కాలేదు. అయినచో నెప్పుడో యురికంబముల కెక్కెడివారే కదా!

వారు జైలులో బంధింపఁబడుటయు, విడువఁబడుటయు కష్టము లనుభవించుటయు వారికది స్వభావ జీవన మయినది వారి యాదర్శజీవనము మఱవఁదగినది కాదు.